# ఉపోద్ఘాతము.

ఈవరాహపురాణము నంది మల్లయ్య ఘంట సింగయ్య యనుకవిద్వయముచే రచియింపఁబడినది. వీ రిరువురిలో నేభాగ మెవ్వరు రచియించిరో తెలిసికొనుట యసాధ్యము. అక్కడక్కడ కవిత్రయమువారిప్రయోగములకు విరుద్ధము లైనప్రయోగములు కానఁబడుచున్నను, మొత్తముమీఁద నీకవులకవిత్వము మిక్కిలి రమ్యమయి రసవంతమయి రసికజనహృదయాహ్లాదకరముగా నున్నది. హరిభట్టకృత మైనవరాహపురాణమునకంటె నిది సర్వవిధముల శ్లాఘ్యతరమయినదిగా నున్నదనుటకు సందేహము లేదు. కవు లీగ్రంథమును కృష్ణదేవరాయలతండ్రి యగునరసింహదేవరాయని కంకితము చేసిరి. అందుచేత వీరు పదునేనవశతాబ్దముయొక్క కడపటిభాగమునం దుండినవా రయినట్టు స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది.

ఈపుస్తకము నొకప్రతి నిచ్చటి ప్రాచ్యలిఖితపుస్తకభండాగారమునుండి వ్రాయించి తెప్పించి రెండుసంవత్సరములక్రిందట నేను రాజమహేంద్రవరము వెళ్ళినప్పుడు నామిత్రు లైన బ్రహ్మశ్రీ మ-రా-శ్రీ సత్యవోలు లక్ష్మీపతిగారు సరిచేసి ముద్రించుటకయి నాచేతి కిచ్చిరి. ఆప్రతి సమగ్రమైనదే యైనను బహుస్థలములయందు పద్యములు విడువఁబడి ముద్రణయోగ్యము కాకుండెను. ఇట్లుండఁగా నామిత్రు లైన బ్రహ్మశ్రీ మ-రా-శ్రీ మానవల్లి రామకృష్ణయ్యగారు సెలవుదినములలో నైజామురాజ్యమునకుఁ బోయియుండినప్పు డచ్చటి గద్వాలసంస్థానమునుండి మఱియొకప్రతిని దెచ్చి నా కిచ్చిరి. ఈప్రతియు శుద్ధమైనది కాకపోయినను మొదటిదానికంటె మేలైనదయి గ్రంథపాతములు లేనిదిగా నుండెను. ఈసాయమునకయి వారికి నాకృతజ్ఞత నిందుమూలమునఁ దెలియఁజేయుచున్నాను. ఈరెండుప్రతులను సాయపఱుచుకొని నాచేతనైన ట్లొకవిధముగా సవరించి శ్రీలక్ష్మీపతిగారినిమిత్తమయి యీపుస్తకమును ముద్రించుటకు మెయినెలలోఁ బ్రారంభించితిని. నే నీనెలలో రాజమహేంద్రవరమునకుఁ బోవ నిశ్చయించుకొన్నందున, నేను బుస్తకమును ముగించి మఱి పోవఁ దలఁచి యత్యంతశీఘ్రముగా నీపుస్తకమును ముద్రాంకిత మొనర్చినాఁడను. ఇందు నాయజ్ఞానమువలనను ప్రమాదమువలనను తప్పులు పెక్కులు పడియుండవచ్చును. అట్టివి కనఁబడినచో సుధీజనులు మన్నించి నా కవి తెలుపుదురు గాక! నాయొద్ద నున్నప్రతితోనే యనంతకవికృత మైనభోజరాజీయమును నేను ముద్రింపఁ దలఁచి యుండఁగా బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణయ్యగారు పూర్వోక్తసంస్థానమునుండియే తెచ్చి మఱియొకప్రతిని నా కిచ్చియున్నారు. ఈపుస్తకమునుగూడ శీఘ్రకాలములోనే ముద్రింపించెదను.

చెన్నపురి,
23- 7- 1904.

కందుకూరి-వీరేశలింగము.

శ్రీ

# వరాహ పురాణము.

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీలీలాస్పద మైనకొమ్మున ధరిత్రీకాంతఁ గారుణ్యల
క్ష్మీలోలాత్మత నెత్తి లీల జలదాశ్లేషైకశృంగోన్నమ
చ్ఛైలాసంబును బోలె నున్న జగదేకస్వామి వారాహదే
హాలంకారుఁడు ప్రోచు నీశ్వరనృసింహాత్మావధూవల్లభున్. ౧.

శా. తా నానందముతోడఁ గుంకుమవసంతం బాడె నో సాఁగసం
ధ్యానాట్యావసరభ్రమీగళితమస్తన్యస్తనాకస్రవం
తీనీరేరుహరేణువుల్ తనువుపై నిండంగ దీపించుగౌ
రీనాథుం డొసఁగున్ గృప న్నరసధాత్రీభర్త కైశ్వర్యముల్ ౨.

ఉ. కూలము డిగ్గి స్నానమునకున్ సురవాహిని సొచ్చి నిల్వఁగా
వాలుగనీరజంబు లొకనాళమునం బ్రభవించె నెట్టివో
ద్యా లని ముగ్ధనాకవనితల్ తనమోములు చూడ నవ్విభా
పాలల నేశ్వరుండు నరసక్షితిజానికి నాయు వీవుతన్. ౩.

చ. స్మరసమరంబునం బరవశత్వము నొంది మహేంద్రనీలభా
స్వర మగుదానవాంతకునివక్షముపై నొరగంటఁ జక్కఁగా
నొరసినహేమరేఖవలె నున్నరమారమణీలలామ యీ
శ్వరునరసింహభూపతినివాసమునన్ వసియించుఁ గావుతన్. ౪.

సీ. కొలనికెందమ్మిపూవులు వినోదార్థంబు పయ్యెదకొంగులోపల వహించి
మందిరాంతరచంద్రమణిశిలాకుట్టిమావనిమీఁదఁ దావచ్చి వచ్చి మెలఁగి
తనసయావకపాదతలములఁ ద్రొక్కినచోటులు దప్పక చూచి నిలిచి
యోహో సరోజంబు లొడివిడి పడియె నేరుకొనంగవలె నని సఖులఁ బిలుచు
ముద్దరాలు తుషారాద్రిముద్దఁబట్టి శ్రీసదాశివదేవాభద్రాసనస్థ
సమరవిజయంబు లొసఁగు నీశ్వరనృపాలు నారసింహవసుంధరానాయకునకు.

శా. లావణ్యాంబులు సాక్షిరూపమున వెల్వం దోడి ముద్వీజన
ద్భావక్షేత్రమునందు పంచఘటయంత్రంబో యనంగా జప
వ్యావృత్తస్ఫటికాక్షదామకము హస్తాబ్జంబునం దాల్చువా
ణీవామేక్షణ నారసింహునికి సంధించున్ వచోవైఖరుల్. ౭.

చ. పెనిమిటితోడ శీతమహీభృత్పతికన్యక జూదమాడి గె
ల్చిన హిమరశ్మిరేఖఁ దనచేతికి నిచ్చిన బాల్యచాపలం
బునఁ గబళింపఁగా విఱిగిపోయినకొమ్మును వచ్చినట్లు మిం
చినకరివక్త్రుఁ డీశ్వరునృసింహునకున్ వరదుండు గావుతన్. ౮.

వ. అని యాశీర్వదించి వచనరచనాచాతుర్యంబున నల్పాక్షరంబుల నధికార్థంబు గూడి యించి పద్యపురాణంబులకు నాదికారణంబు లైనసంస్కృతాంధ్రభాషలం గలజల్లులు విసర్జించి రసపోషణప్రధానశబ్దంబు లుపార్జించి భక్తజనమనోరథనిర్వాహకమహా వరాహదేవచరణస్మరణాయత్తచిత్తులమై. ౯.

సీ. అతిపవిత్రం బైనయమునాతరంగిణీసైకతం బెవ్వనిజన్మభూమి
ప్రామినుకులు సూత్రపఱిచి లోకహితంబుగా నిర్వహించె నెవ్వానిబుద్ధి
కలుషంబు విదళింపఁ గలధర్మశాస్త్రప్రపంచంబు లెవ్వానిపలుకుబళ్ళు
కాదనద్దకౌరవక్షోణిపాలవతంసవంశంబు నిలిచె నెవ్వానివలన
నట్టిసాత్యవతేయమహామునీంద్రుఁ డనుసుధాబ్ధికిఁ గల్పకం బనఁగ వెలయు
శ్రీవరాహపురాణంబు చెప్పఁ గడఁగితిమి తెనుంగునఁ గవికులోత్తములు పొగడ.

వ. ఈకృతిప్రారంభంబు కర్ణాకర్ణికావశంబున విని సంతతసత్యభాషాహరిశ్చంద్రుండును శుభవచనదుగ్ధాబ్ధిచంద్రుండును నిరాఘాటధాటీచటులఘోట్టాణోరట్టకంఖాణపుంఖానుపుంఖరింఖాఖురట్టసుట్టితతమాధూళిరింఛోళిసంఛాదితాదిత్యుండును నుబ్బరాదిత్యుండును చతురకూపారపరీతధరణీపాలసభాభవనకవినివహస్తూయమానదానవిద్యాపరాయణుండును చాళుక్యనారాయణుండును విశ్వవిశ్వంభరాభరణభుజాస్తంభసంభావితకుంభికుంభీనసకమఠనాథవరాహుండును బర్బరబాహుండును సముద్భటప్రతిభటఘటాభయంకరవిక్రమక్రమాధరీకృతేశ్వరకుమారుండును నీశ్వరకుమారుండును నగునరసవసుధాధీశ్వరుం డొక్కనాఁడు. ౧౦.

సీ. అష్టభాషాకవితాబ్జసంభవు లైనసుకవిపుంగవులు సంస్తుతులు సేయ
సంకీర్ణరాగరంజను లైనగాయకులు గీతప్రబంధములు పాడ
కలకంకణక్వాణకలితసరోరుహ లైనరమణులు వింజామరములు వీవ
మండలాధిపు లైనశరణాగతారాతిసామంతు లుభయపార్శ్వములఁ గొలువ

వ. తదనంతరంబ కృతిపతికిం బతి యైనసాళువనరసింగరాజరాజమౌళిపావనాన్వయంబు మొదల వర్ణింతును చింతారత్నకామగవికల్పవృక్షలక్ష్మీపక్షపాతులతోడం బుట్టి మిన్నుముట్టినపాలమున్నీటిపట్టి సాయంతనసమయసంఫుల్లమల్లీమతల్లికాగుళుచ్ఛస్వచ్ఛకాంతిని స్తంద్రుండు చంద్రుండు వంశకర్తగా సకలకలికలుషాపహర్తయంకిదేవమహీభర్త కీర్తికార్తికచంద్రికాప్రభావంబులు వినిర్మించి దశదిశాంచలంబులు ముంచెఁ దత్తరాజుండు చతుష్షష్టివిద్యావినూతనభోజుండు గుండ్రాజు దుండగపురాచతండంబులం జెండాడి మండలగ్రావంబు కెలంకుల గెలుపుఁగంబంబులు నిలిపెఁ దత్సూనుండు గాండీవధన్వసమానుండు సాళువరాజు ఘోరాహవహట్టంబునం బారసికతురగఘట్టంబులం గనుపుగొట్టి ధరావరారోహా బాహుపీఠంబునం గుదురుపఱచెఁ దత్పుత్త్రుండు నిరాతంకప్రతాపకమలమిత్రుండు గౌతరాజు రాజసంబున గుణలతావితానంబులు సేతుశీతాచలమధ్యపృథ్వీమండలంబున మెండుకొలిపెఁ దత్సుతుండు వీరలక్ష్మీసమన్వితుండు గుండరాజు వీరోద్ధిరవనీవిఖండనప్రచండదోర్దండమండలాగ్రుండును సముద్దండసాహసక్రియాసమగ్రుండును నై నిరవధికప్రభావదుండుమారులం దిమ్మనాథనరసింగపార్థివులం గాంచె వారిలోన.

సీ. తుహినాంశువంశపాథోరాశిమాణిక్య మష్టదిగ్గజభయంకరుండు
కర్ణాటరాజ్యరక్షణదక్షబాహాసి వరవసంతత్యాగవైభవుండు
శివరాత్రిసమయసంశీలతాగుణశాలి ధరణీసుపర్వనిస్తారకుండు
విరచితాతులతులాపురుషదానవిభూతి సమదరాయకటారిసాళువంబు
గుండవిభునారసింహభూమండలేశ్వరుండు గణుతింప రాజమాత్రుండు గాఁడు
కిన్నరస్త్రీసమూహజేగీయమానవర్తనంబులు గలచక్రవర్తిగాని. ౨౧.

మహాస్రగ్ధర. నరసింగస్వామి రంగన్నగనిభగజగంధర్వపాదాతసైన్య
స్ఫురణాసంపత్తి విద్యుత్స్ఫురములు బలిమిం బూని కాల్పంగ ధూమో
త్కరముల్ కాదంబినీమార్గము నిబిడముగాఁ గప్పి మందాకినీపు
ష్కరముల్ భానూద్భవాపుష్కరములకరణిం గానిపింపంగఁ జేయున్. ౨౨.

శా. హేలన్ భార్గవరాముతోడ ననుచున్ భూషింప వేలాపరీ
తేలామండల మాధరాధరముగా నేకాతపత్రంబుగా
నేలున్ సాళువనారసింహుఁడు భుజంగేంద్రాద్రిపై నున్నల
క్ష్మీలావణ్యసరోమరాళము చిరశ్రీవృద్ధి గావింపఁగన్. ౨౩.

వ. అట్టినరసింగరాజరత్నంబుచేత మన్ననవడసి సైన్యనాయకపట్టభద్రత్వంబున నిర్నిద్రవిజయలక్ష్మీమహత్త్వంబున మదవదభిమానిభయదసత్త్వంబున దీర్ఘాయు

రైశ్వర్యధుర్యుం డైనయీశ్వరనాయకునకుం బ్రియతనూభవుండు సరసవసుధాధ్య
క్షుండు నిర్వంచితానుగ్రహంబునం బరిగ్రహించి యిమ్మహాప్రబంధంబునకు శృంగార
విభూషణంబుగాఁ దదీయవంశావతారంబు రచియింతు మని యెట్టిదనిన. ౨౪.

ఉ. మిన్నుల మించి భాగ్యముల మీఱినకోటల రమ్యహర్మ్యసం
పన్నత సస్యవాటగరిమంబులఁ దోఁటల వాహవారణా
ఢ్యున్నతిఁ గేలిదీర్ఘికల నుగ్రభటావలి వన్నెకెక్క వా
రాన్నిధికాంచి పైఁ దుళువరాజ్యము సంతతవీరభోజ్యమై. ౨౫.

క. ఆతుళువరాజ్యమున విఖ్యాతి వహించిరి దిగంతకరికటతటసం
భూతమదక్షాళనవిద్యాతత్పరకీర్తిఁ బెద్ద యాడిసరాజుల్. ౨౬.

ఉ. వారల కగ్రగణ్యుఁడు నివారితవైరివరూథినీధవ
శ్రీరమణీవిలాసుఁడు విచిత్రకళాకుశలుండు తిమ్మధా
త్రీరమణుండు సంపద వరించె మరాటవరాటలాటగాం
ధారయుగంధరాధిపసదఃప్రకటీకృతబాహువీర్యుఁడై. ౨౭.

చ. అతనికులాంగనాతిలక మైనపవిత్రచరిత్ర దేవకీ
సతి కృతపుణ్యులం గనియె శాంతివతంసుల సజ్జనావన
వ్రతపరిపాలనాగుణపరాయణచిత్తుల దుర్మదోద్ధతా
హితవనదావపావకుల నీశ్వరతిమ్మధరాతలేంద్రులన్. ౨౮.

క. అం దగ్రజుండు కవిజనమందారము పతిహితైకమతి మానవతీ
కందర్పుఁడు తేజోమధ్యందినమార్తాండుఁ డీశ్వరాధిపుఁ డుర్విన్. ౨౯.

సీ. ఉదయాద్రి భేదించె నుత్తరి నిర్జించె గండికోటపురంబుఁ గదలఁ ద్రవ్వె
పెనుగొండ సాధించె బెంగళూరు హరించెఁ గోవెల నెల్లూరు గుంటుపఱిచె
కుందాణి విదళించె గొడుగుచింత జయించె బాగూరు పంచముపాడుచేసె
నరుగొండ వెకలించె నామూరు మర్దించె సీరంగపట్నంబు బారిసమరె
రాయచౌహత్తమల్లధరావరాహ మోహనమురారిబర్బరబాహుసాళ్వ
నారసింహప్రతాపసన్నాహుఁ డగుచు విశ్వహితకారి తిమ్మయయీశ్వరుండు.

మ. నరసింగక్షితిపాలుపంపునను గౌనాఁ జేసి దండెత్తి యీ
శ్వరభూభర్త బెడందకోటయవనాశ్వవ్రాతముల్ భీమసం
గరరంగంబునఁ గొల్లకట్టుకొని వీకం గందుకూరీపురాం
తరసీమంబునఁ జక్కఁగా నిలిపె దుర్దాంతారిసంతానముల్. ౩౦.

సీ. కనుఁ గొన్న మొదలు తక్కినమాట లాలింప బుద్ధిపుట్టనిపుట్టుభోగి విడిచి
వా లిచ్చి నడవడి వర్ణింపఁదగినలావరిదిగ్గజమువంటివాని విడిచి
తనలోఁతుపాతు సైతము గానరాఁ గూర్మిఁ గలిసిన కులగిరిమూలకానిఁ బదలి
నిలుకడ గలకూటములఁ బాయఁజాలక మురగినకోలంపుఁబంతిదొరఁ దొలంగి
వలచి వచ్చిన నిల్లాలిబలె భరించి। పసలఁ జిక్కించి విలసన్నప్రౌఢనిజభు
జాపరీరంభసుఖములవపులు చూపె। విశ్వధాత్రికిఁ దిమ్మయయీశ్వరుండు. ౩౨.

క. సరి వచ్చు నీతిభూతిప। తరణంబులఁ దిమ్మధరణిధవనందనుఁ డీ
శ్వరుఁడు యుగంధరశిలికం। ధరకంధరములకు సని జనంబు నుతింపన్. ౩౩.

క. ఆబాంధవనిధి గారాఁ। బాబుక్కాంబల వరించెఁ బరమవివేక
ప్రాబల్యంబున భూలో। కాబాలలఁ బెండ్లి యైన శ్రీహరిపోలెన్. ౩౪.

క. అదితికి నింద్రోపేంద్రులు। విదితప్రాభవులు సంభవించినపగిదిన్
సదమలపతివ్రతాసం। పద వెలసినతత్సరోజపత్రాక్షులలోన్. ౩౫.

క. బుక్కాంబకు జన్మించిరి। చక్కనిరూపములఁ బంచసాయకు లనఁ బెం
పెక్కినభుజాబలంబున। దిక్కరు లన నారసింహతిమ్మసమాహ్వుల్. ౩౬.

గీ. ఇట్లు తుళువాన్వయాగ్రణి యీశ్వరుండు। పూర్వజన్మతపఃఫలంబునఁ గులంబు
ధన్యత వహింపఁ గన్నపుత్రకులలోనఁ। బ్రభుత మైకొని నరసింహపార్థివుండు. ౩౭.

క. భువనంబులు మెచ్చఁగ శై। శవయౌవనసంధి సఫలసంతానములున్
సవరించె వాని కెన్నఁగ। సవతు సుధాంధసులు దక్క సర్వంసహపైన్. ౩౮.

సీ. చర్చించి చూచిన సర్వజ్ఞతాపటుప్రౌఢిమ మరువంబుపరిమళంబు
పరికించి చూచిన నిరుపమత్యాగలక్ష్మీవిలాసము దేవతావరంబు
భావించి చూచిన బహుమానసమ్యగ్దయావిశేషోక్తి శిలాక్షరంబు
తర్కించి చూచిన ధర్మసంపాదనక్రీడావివేకంబు తోడునీడ
దర్పదారితహరిణచాపక్ష్మాధర్యవీర్యగాంభీర్యగుణములు వేరె యొడఁ
బుట్టినవి సాటిచెప్పంగ రాట్టుకృపల। నీశ్వరప్రభునరసపృథ్వీశ్వరునకు. ౩౯.

స్రగ్ధర. ఉద్ఘాటించున్ సమిత్సంయుతరిపునృపతివ్యూహకల్పాంతకాలా
త్యుద్యద్ఘర్మాంశుప్రభాళీధళధళనిభముల్ తాంతకాంతారభూ
మ్యుద్ధూతాగ్నిచ్ఛటాశ్రీధగధగసరముల్ దర్పసంపత్కళాభా
స్వద్ఘోటీఘోటధాటీశ్వరనరసనరేశప్రతాపాతపంబుల్. ౪౦.

సీ. వివిధచిహ్నంబులు వేర్వేర పూనంగ విష్ణుశంకరుల భావింప వచ్చె
సూచికాముఖమునఁ జూడంగ హరినీలహీరోపలంబుల నెఱుఁగ వచ్చె

జిహ్వాగ్రమునఁ బరీక్షింపంగ లవణాబ్ధికలశార్ణవంబులు దెలియ వచ్చె
నలపున భేదంబు గలుగంగ మృగనాభిహిమవాలుకల నిర్ణయింప వచ్చెఁ
గాని లేకున్న నేకప్రకారమై సామస్తమును సంతతభ్రాంతి నావహించు
ననఁగ నీశ్వరనారసింహాత్మజామాధిపతియశశ్చంద్రికాకదంబములు నిగిడె. ౪౧.

ఉ. పుడమి హిరణ్యకూస్యవశఁ బొందఁగఁ జేయక విక్రమంబుఁ జూ
పెడుసమయాన మార్గ్గమును బెట్టక పట్టక దేవతార్థ మె
య్యెడ దయమాలి పుణ్యజనహింసకుఁ బోవక సంచరించినం
గడిమి నృసింహమూర్తి సరిగాఁ దగు నీశ్వరనారసింహుఁడోన్. ౪౨.

షష్ఠ్యంతములు.

క. ఏతాదృశవిశదగుణా। న్వీతునకు నిరంతరాయవితరణజితజీ
మూతునకు వార్ధివేష్టిత। భూతలరక్షావతీర్ణపురుహూతునకున్. ౪౩.

క. దంభసరఃకరటికి దో। స్తంభనిశాతాసిసటికి సకలధరిత్రీ
సంభారభరణధిక్కృత। కుంభీనసకుంభికూర్మకుహనాకిటికిన్. ౪౪.

క. పౌరుషనాభాగునకు ది। నారంభణభాస్కరప్రభాభోగునకున్
ఘోరాజివిజయభేరీ। ధీరధ్వనిదళితనిఖిలదిగ్భాగునకున్. ౪౫.

క. వాణీకరవీణాని। క్వాణరతికి వినయమతికి వరలక్ష్మీక
ల్యాణనరసింహవిజయపు। రాణకథారమణతానురాగస్థితికిన్. ౪౬.

క. పరిచితబోధునకు నిరం। తరకాంతకృపాణాసనాథునకు సాళ్వశ్రీ
నరసింగవిభుచమూపే। శ్వరనృపతికుమారనరసజననాథునకున్. ౪౭.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా మారచియింపం బూనినవరాహపురాణంబునకుం
గథాప్రారంభం బెట్టిదనిన. ౪౮.

సీ. సకలపుణ్యారణ్యసస్యవాటములు దట్టపు లైనపులకాంకురములు గాఁగ
సరసీనదీనవసలిలపూరము శరీరమునఁ గ్రమ్మినకమ్మఁజెమట గాఁగ
జాతసంభ్రమజంతుసంతానకోలాహలములు గద్గదభాషణములు గాఁగ
కకుబంతకరదంతకాండకాంతిప్రసారంబు వివర్ణభావంబు గాఁగ
జలధికాంచీవరారోహ సాత్త్వికోదయముల బొదలంగ నిజదంష్ట్రికాగ్రబాహఁ
గాఁగిలించె నిశాచరగంధకరటిపాకళంబు మహాకుహనైకళంబు. ౪౯.

క. ఉత్సవంబున జలనిధి। వీచులఁ దనుఁ ముసుఁగ నీక వెడలించిన ధా
త్రీసతిలేక్షణ సనయ। శ్రీచతురశ్రీఁ బలికె హరికిఁ బ్రసూతోషన్. ౫౦.

గీ. ఏమహాత్ముండవో నిర్ణయింప రాదు। నీవ ప్రతికల్పమున నన్ను నిర్వహింతు
సకలలోకైకనాథ నీజన్మవిధము। నాదిసృష్టియుఁ దెలియంగ నానతిమ్ము. ౫౧.

సీ. పాఠీనమూర్తివై పగవాని ద్రచ్చి వేదములు దెచ్చితి రసాతలము చొచ్చి
కచ్ఛపరూపివై కలశాబ్ధి వసియించి గిరి వహించితి దురంధరత మించి
కిటివేషివై నన్నుఁ గృపఁ జూచి కాచితి కఠినదంష్ట్రావిటంకమున మోచి
నరమృగాకృతివై జనశ్లాఘ వ్రాలి ప్రహ్లాదు నేలితి పలలాశిఁ ద్రోలి
వామనుఁడవై బలీంద్రుగర్వంబు చెఱిచి। భార్గవుఁడవై సమస్తభూపతుల నలిచి
రాఘవుఁడవై దశాస్యువక్త్రములు డులిచి। నిలిచినాఁడవు నీమాయఁ దెలియవశమె.

వ. దేవా యీవారిధి మునింగి కలంగి మిగుల నాపన్నయైన నన్నుద్ధరించితి దురవ
గాహంబు లైనభవదీయగుణసమూహంబులు చతుర్ముఖప్రముఖనిఖిలబృందారకు
లకు వితర్కింప నలవిగా దనిన నే నెంతటిదాన మానరానికృత్యంబులు దుష్టనిగ్రహ
శిష్టపరిగ్రహంబులు నీకు నిటమీఁద నీవు సృష్టి గల్పించువిధంబును మదీయసృష్టి
కారణప్రమాణంబులు నాద్యవసానంబులును యుగచతుష్టయసంఖ్యానామధేయం
బులును యుగవిశేషంబులం బుట్టునవస్థాభేదంబులును మదవదరాతినరాధిపతుల
నిర్జించి దోషంబుల విసర్జించి రాజసూయహయమేధాదిమహాధ్వరవిధానంబుల
సుకృతంబు లార్జించి ఖచరచకోరలోచనాకుచలికుచపరిరంభసంభావనావిరాజు
లైనరాజులచందంబును నన్నుఁ బ్రసన్నునిం జేయు తెఱంగు నెఱింగింపు మని
విన్నవించిన. ౫౩.

క. ఆవాక్యంబులు విని కపటావనిదారంబు దంష్ట్రికాంకూరవిభా
భావళ్యంబులు దిక్కులపై వెన్నెల వెదలు చల్లఁ బకపక నగినన్. ౫౪.

ఉ. కానఁగ వచ్చె నవ్విభునిగర్భకటాహములోన దేవతా
దానవయక్షకింపురుషతారకశీతకరార్కవహ్నిరు
ద్రానిలసిద్ధసాధ్యవిపినాద్రిసముద్రసరస్తరంగిణీ
మానిభుజంగవిశ్వవసుమానవముఖ్యజగత్ప్రపంచముల్. ౫౫.

క. అవి చూచి మానసంబునఁ। గవిసినభయవిస్మయముల గాత్రంబునఁ గం
పవికారము దలకొనఁగా। నవనివరారోహ నిలువ నంతటిలోనన్. ౫౬.

సీ. శ్రీవత్సకౌస్తుభశ్రీవైజయంతులు గనుపట్టువిపులవక్షంబుతోడ
శార్ఙ్గకౌమోదకీశంఖచక్రంబులు గలభుజార్గళచతుష్కంబుతోడ
శ్రుతిపాఠపరతంత్రమతికి బ్రహ్మకు నివాసం బైననాభిపద్మంబుతోడ
బాలార్కబింబప్రభాడంబరంబు విడంబించుపీతాంబరంబుతోడ

శరధిలోపల ఫణమణికిరణపటలీ। కాతరంగితశేషశయ్యాతలమునఁ
బవ్వళించినమూర్తి యేర్పడఁగఁ దాల్చె। సూకరాకృతి వీడ్కొని లోకభర్త. ౫౭.

క. ఆలక్ష్మీపతిఁ గని శై। వాలస్థలినడుమ నున్నవనరుహకళికం
బోలఁగఁ దలపై నంజలి। గీలుకొలిపి సవినయమతి క్షితి నుతి సేసెన్. ౫౮.

ఉ. నీరజనేత్ర వందనము నీకు రమారమణీపతీ నమ
స్కారము నీకు భక్తజనకల్పక దండము నీకు రక్షణో
దార జొహారు నీకు మహిమాంబునిధీ నతి నీకు నీకు జే
జే రజనీచరాన్వయవిజిత్వరసత్వరబాహువిక్రమా. ౫౯.

మ. మును నీచూపినసూకరాకృతివిధంబున్ గర్భగోళస్థలో
కనికాయంబునుఁ జూచి యే నతిభయాక్రాంతాత్మ నైతిన్ జనా
ర్దన కాంతన్ శరణాగతన్ నిరపరాధ న్నన్ను మన్నించి తె
ల్పు నిరాఘాటకృపాసుధారసమయాంభోరాశిపూరంబునన్. ౬౦.

వ. అని వినయపూర్వకంబుగా బహుప్రకారంబులం బ్రశంసించి మదీయపదంబులు కేశవుండును జంఘలు నారాయణుండును నితంబంబు మాధవుండును గుహ్యంబు గోవిందుండును నాభి విష్ణుండును జఠరంబు మధుసూదనుండును వక్షంబు త్రివిక్రముండును హృదయంబు వామనుండును గంఠంబు శ్రీధరుండును వదనంబు హృషీకేశుండును నేత్రంబులు పద్మనాభుండును మస్తకంబు దామోదరుండును రక్షింతురుగా కని వాసుదేవు మాసనామంబుల నంగన్యాసంబు చేసి వసుమతీసతి పునఃప్రణామంబు గావించి నిలిచినఁ బ్రసన్నుం డై వెండియు నప్పుండరీకాక్షుండు దాక్షిణ్యలక్ష్మికి నాకరం బైనసూకరాకారంబు వహించి రత్నాకరకాంచిం గాంచి యిట్లనియె. ౬౧.

గీ. అవనికామిని నీవు న న్నడిగినట్టి। ప్రశ్న మత్యుత్తమంబు దుర్లభము నిఖిల
వేదశాస్త్రార్థసారంబు వినుము సావ। ధానమతివై వచింతు విస్తరము గాఁగ. ౬౨.

క. క్రమమున సర్గప్రతిసర్గములును మన్వంతరప్రకారంబులు వం
శములును వంశానుచరిత్రములును లక్షణము లివి పురాణంబునకున్. ౬3.

వ. అం దనాదిసర్గం బెట్టిదనిన మొదల నాకాశంబునుం బోలె నాతతం బై నిలుతు నట్టి నావలన నణురూపంబున నొక్కబుద్ధి జనియించె నది సత్వరజస్తమోగుణంబులఁ ద్రివిధం బై వేర్వేర తత్వరూపంబులు వహించె నందు సృష్టికిం బ్రధానం బైనమహత్తత్వంబు గల్పించితి నాతత్త్వంబున క్షేత్రజ్ఞుండు గలిగె నతనిబుద్ధిని మానసంబు పుట్టె మానసంబున శ్రవణాదిహేతువు లగునర్థంబులు సంభవించె నర్థంబులవలన

నింద్రియంబు లవతరించె నివి సకలంబును బిండాకారం బయ్యె నప్పిండంబు మాయ మాయ నాచేతం బ్రతిష్ఠితాత్మయై శూన్యంబై తోఁచె శూన్యంబున శబ్దంబును శబ్దంబున గగనంబును గగనంబున సమీరంబును సమీరంబునఁ దేజంబును దేజంబున సలిలంబును సలిలంబున భూతధాత్రియు నిర్మించితి. ౧౪.

గీ. నెలఁత భూమ్యాదు లైనయిన్నియునుగూడఁ। గానొకసబుద్బుదంబైనకలలమయ్యె
నక్కలలమండమై పొల్చె నది ప్రవృద్ధిఁ। బొంద జనియించె నీచందమున జగంబు.

గీ. ఆది మద్రూప మగుజలం బాత్మ నైన। యే రచించితి సలిలంబు నార మనఁగ
సంజ్ఞ వహియించె నందులో సంతతంబు। నుండుకతమున నారాయణుండ నైతి.

క. సారెసఁ గల్పంబుల న। న్నారంబులఁ బవ్వడింప నాబొడ్డున నీ
రేరుహము పుట్టె నజుఁ డవ। తారంబునఁ బొందె నందుఁ దత్కమలభవుఁడు. ౧౭.

క. కనుఁగొని కల్పింపుము జగ। మనుచు నదృశ్యుండ నైన నటు చేయఁగ నా
య్యనువును బొడగానమి నా। తనికిం గోపంబు పుట్టెఁ దత్కోపంబున్. ౧౮.

ఉ. బాలకుఁడై విరించితొడ నై వసియించి ధ్వగంబుఫూరముల్
జాలుకొనంగ నేడ్చుటయు సాంత్వనభాషల నేడ్పు మాన్ప న
బ్బాలుఁడు పేరు పెట్టు మని పల్కిన రుద్రసమాఖ్య యిచ్చి భా
షాలలనామనోహరుఁడు సర్వము నీవు సృజింపు మావుడున్. ౧౯.

క. తా లోకవినిర్మితికిం। జాలక రుద్రుండు కాఁడసలిలమునఁ దప
శ్శీలుండై నిలిచిన నా। వేళ సరోజాసనుఁడు వివేకము కలిమిన్. ౨౦.

క. తనదక్షిణవామాంఘ్రుల। పెనువ్రేళ్ళను దక్షు నతనిప్రియసతి నిర్మిం
చిన వారికి స్వాయంభువ। మనువు కలిగె మనువుచే సమస్తము పుట్టెన్. ౨౧.

గీ. అనుచు సద్దేవుఁ డానతిచ్చినవిధంబు। తెలియఁగా విని భూతధాత్రీవధూటి
సకలలోకైకనాథ విస్తరము గాఁగఁ। బ్రథమకల్పంబు నాకుఁ జెప్పంగ వలయు.

మ. అని ధాత్రీసతి పల్క నిట్లను వరాహస్వామి నారాయణుం
డను నీబ్రహ్మ సమస్తభూతములఁ గల్పాదిన్ వినిర్మించె నం
గన తన్నిర్మితి నీకు నేర్పడఁగ వక్కాణింతు నాలింపు పో
యినకల్పావధిరేయి నిద్రితుఁడనై యే మేలుకో నత్తఱిన్. ౨౩.

క. నిరవధికుఁడు షడ్గుణసం। భరితుఁడు నారాయణుండుఁ బరపూర్వజుఁడున్
బరమాత్ముఁడు నిఖిలచరా। చరజనకుఁడు నైనబ్రహ్మ సత్వాధికుఁ డై. ౨౪.

గీ. కల్పనాబ్ధి శూన్యలోకంబు లెల్లఁ। గని జగత్సృష్టిసంహారకర్త నిండ
రాసతీభర్తఁ గూర్చి నారాయణాత్మకంబు హృద్యంబు పద్య మొక్కటి పఠించె.

శ్లోకము. ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః
అయనం తస్య తాః ప్రోక్తా స్తేన నారాయణః స్మృతః. ౭౬.

వ. అని పఠించి. ౭౭.

క. ప్రమదంబున గతకల్పాంతము నాఁడును బోలె సృష్టి దాఁ దలఁపఁగ న
క్కమలజునివలన నొకసర్గము పుట్టె నబుద్ధిపూర్వకము దామసమై. ౭౮.

వ. అట్లు పుట్టినసృష్టి పంచపర్వ యగు నవిద్య యిదియ ప్రపంచప్రకారంబును నజ్ఞానమయంబును నగుముఖ్యసర్గం బనం బరంగె మఱియు నుత్తమసర్గం బొకటి చింతింపఁ దిర్యక్స్రోతోమయం బగుసర్గంబు జనియించె నది యుత్పథగ్రాహు లైనపశ్వాదులగుట నసాధకం బని వెండియు నొక్కసర్గంబు విచారింప నూర్ధ్వస్రోతోమయం బగుసర్గం బవతరించె నది నూర్ధ్వచారులు సాత్వికస్వభావులు నైనదేవతలగుట నసాధకం బని యర్వాక్స్రోతోమయం బగుసర్గంబు నిర్మించె నందు సాధకులు నత్యంతప్రకాశులు రజోధికులుఁ దమోతిరిక్తులు దుఃఖసంసక్తులుఁ బునఃపునఃప్రవర్తకులు నైనమనుష్యు లుద్భవించిరి ప్రథమం బగుమహత్సర్గంబును ద్వితీయం బగుతన్మాత్రసర్గంబును దృతీయం బగువైకారికంబును నగునింద్రియసర్గంబును బుద్ధిపూర్వకంబు లగుప్రాకృతసర్గంబులు స్థావరాత్మకం బగుముఖ్యసర్గంబును పశుప్రధానం బగుతిర్యక్స్రోతోసర్గంబును దేవభూయిష్ఠం బగునూర్ధ్వస్రోతోసర్గంబును మనుష్యప్రచారం బగునర్వాక్స్రోతోసర్గంబును సత్వతమోమయం బగునను గ్రాహసర్గంబును వైకృతసర్గంబులు ప్రాకృతసర్గంబులు మూఁడును వైకృతసర్గంబు లైదును బ్రాకృతంబును వైకృతంబును నగుకుమారసర్గంబునుంగూడఁ దొమ్మిదిసర్గంబు లివి జగంబులకు మూలహేతువు లింక నేమేమి వినవలయు ననుఁగు మనిన. ౭౯.

గీ. భూతి యిట్లను నవ్యక్తజన్ముఁ డైనజలజభవుచే జనించినసర్గనికర
మొప్పఘనంబున వర్ధిల్లె నెఱుఁగఁ జెప్పు త్రిభువనాపననన్నాహ శ్రీవరాహ. ౮౦.

క. అనవుడు విని ధాత్రికి ని ట్లని చెప్పె వరాహదేవుఁ డాది స్వసజా
సనుఁడు సృజియించె రుద్రుని వెనుకను సనకాదిమౌనివితతి సృజించెన్. ౮౧.

వ. ఆతరువాత మరీచ్యత్రుల నంగిరఃపులహులం గ్రతుపులస్త్యులం బ్రచేతోభృగువుల నారదవసిష్ఠుల సృజియించి వీరిలోన నారదుం డొకఁడు దక్కన తొమ్మండ్రం బ్రవృత్తిధర్మంబునకు నియోగించి సనకాదుల నివృత్తిధర్మంబునకు నియోగించె.

గీ. విధిపదాంగుష్ఠమున సంభవించె నెవ్వఁ డట్టిదక్షునికూఁతురికన్యలకుఁ బుట్టె
సురనిశాచరగరుడకింపురుషకిన్నరాదికం బైనసకలచరాచరంబు. ౮౨.

సీ. వెనుకకు నాగ్రహించినవేళ నర్తిత్రభ్రూలతాభయదాత్మఫాలభూమి
నవతరించినరుద్రు నర్ధనారీనరాకారుని వీక్షించి కమలభవుఁడు
నీవిగ్రహము రెండుగా విభజింపు మటంచు నంతర్ధాన మైన నతఁడు
నారీవిభాగంబు నరవిభాగంబును నేర్పున వేర్వేర నేర్పఱించి
వానిలోపల నరభాగ మానుపూర్విఁ। బదునొకండువిధంబులఁ బంచివైచె
నదెకద పదునొకొండవ దనఁగఁ బరఁగు। రుద్రసర్గంబు ధాత్రీసరోజనేత్ర. ౨౪.

క. ఈపగిది సృష్టి గణ్యంబై పొదలిన యుగచతుష్టయస్థితి వినుమా
రూపింతుఁ గృతత్రేతా। ద్వాపరకలినామకములు దాలుచు యుగముల్. ౨౫.

క. ఆయుగములు జనవినుత। న్యాయపరాయణులు మనుజనాథులు సురదై
తేయులు చేసినధర్మ।ప్రాయచరిత్రములు తత్పరత విను మనుచున్. ౨౬.

సీ. ఆనతి యిచ్చె మాయావరాహస్వామి ప్రథమకల్పంబునఁ బ్రభవ మైన
మనువు స్వాయంభువుం డనువాఁడు గనియె నందనులఁ బ్రియవ్రతోత్తానపాద
నామధేయుల వారిలో మదారాతిసంహరణవ్రతుండు ప్రియవ్రతుండు
హయమేధరాజసూయంబులు మొద లైనక్రతువులు సాంగంబు గాఁగఁ జేసి
వసుమతీచక్ర మేకోష్ణవారణముగ। నేలి భరతాదిసుతులకు నేడుదీవు
లును విభాగించి యిచ్చి తాఁ జనియెఁ బిదప। బదరికారణ్యమునకుఁ దపంబుసలుప.

క. ఈవిధమునఁ జని భస్మజ।టావల్కలధారియై దృఢవ్రతనియతిన్
భావములోఁ బరతత్త్వము। భావింపుచు మోహపాశబంధచ్యుతుఁ డై. ౨౮.

శా. అవ్వాటం దప మాచరింపఁగఁ దదీయాయత్తచిత్తంబునన్
వచ్చెన్ సురమౌని నారదుఁడు పాణిన్వీణాతంత్రులన్ భ
వ్యచ్చారంబున మూర్ఛనాస్వరవిశేషంబుల్ వెద ల్చల్లఁగా
నిచ్చల్ మెచ్చుచు దేహచంద్రికలు రాకేందుచ్ఛవి న్మీఱఁగాన్. ౨౯.

ఉ. అప్పుడు దా నెదుర్కొని కృతాంజలియై నృపుఁ డర్ఘ్యపాద్యముల్
దప్పక యిచ్చి మౌని కుశలం బడుగన్ వినిపించి యిట్లనుం
జెప్పుము నిర్వికార సరసీరుహగర్భకుమార యేమియుం
దప్పక నాకు నీకృతయుగంబున నీకనుఁగొన్నచిత్రముల్. ౩౦.

మ. అనినన్ సంయమి చెప్పఁగాఁ దొడఁగె వాక్యప్రౌఢి నిన్నంబగల్
చనియెన్ గంటి నిరస్తభక్తజనతాసంతాపమున్ విశ్వమో
హనకృత్కిన్నరకామినీమధురగానాలాపమున్ శార్ఙ్గసా
ధనకారుణ్యగుణానురూపమును శ్వేతద్వీపమున్ భూవరా. ౩౧.

వ. అందు నందూయమితగంధసింధురంబుచందంబున మందాందోళితపుష్కరం బై పుష్కరస్థలంబు తెఱంగున సంసక్తరాజహంసం బై రాజహంసమండలవిధంబున నుద్దండపుండరీకం బై పుండరీకాదిగజవ్రజంబులాగున ధృతాఖిలచక్రం బై చక్రవర్తి సభాభవనంబునకైవడి సదాధిష్ఠితకవియై కవిమందిరాంగణంబుభంగి సమాసన్న పుణ్యజనం బై పుణ్యజనేశ్వరభాండాగారంబుపోలికఁ బరిస్థాపితశంఖం బై శంఖసంఖ్యానంబు తేవ నత్యధికం బై పరస్పరఘట్టనంబులం దరంగంబులు నాఁగఁ దరంగంబుల మరాళంబు లుయ్యేలలూఁగ మకరందనిష్యందంబుల నరవిందంబులు విఱ్ఱవీఁగ నరవిందంబుల నిందిందిరంబులు మూఁగ మంథరగంధవాహవిహారంబుల శీకరంబులు రేఁగ శీకరంబు లంటఁ దీరావనిరుహంబులు దొప్పదోఁగ జలపక్షిపక్షవిక్షేపంబులఁ బద్మినీపత్త్రంబులు దెలుపిగాఁగఁ బద్మినీపత్త్రంబులక్రిందఁ గందర్పకేలికిం జక్రవాకమిథునంబులు డాఁగ మనోహరం బై సిరి దొలంకుకొలంకు కెలంకున. ౯౨.

సీ. తనకొప్పు శైవాలమును బోల్పఁ దననిడువాలుఁగన్నులు గండుమీలఁ బోల్పఁ
దనమోము నీరజంబును బోల్పఁ దనముద్దువాతెఱ బంధుజీవకముఁ బోల్పఁ
దనకంధరము శంఖమును బోల్పఁ దనబాహులతికలు నవమృణాలములఁ బోల్పఁ
దనచన్నుఁగవ చక్రదంపతులను బోల్పఁ దనకటీరము సైకతమును బోల్ప
విని మనంబున నమ్మక వీనివాని। వాసి దెలియంగ వలె నని వచ్చె ననఁగ
నెంతయును సౌకుమార్యంబు వింతగొలుప। నొంటి విహరించు నొకమచ్చెకంటిఁ గంటి.

క. కని యెవ్వతెవు జగన్మో।హిని నీనామంబు చెప్పు మిచ్చోటికి వ
చ్చినకార్య మేమి యనవుడు। విని తప్పక చూచి తరుణి వికవిక నవ్వెన్. ౯౪.

ఉ. ఆనలినాక్షి నవ్వుటయు నంతట నామహిమంబు దూలెనో
కాని వసుంధరాధిప వకావకలై చెడిపోయె బ్రహ్మవి
జ్ఞానము వేదశాస్త్రపతనప్రతిభావిభవంబు గానవి
ద్యానిపుణత్వముం దపము ధర్మవిధిజ్ఞతయు న్వివేకమున్. ౯౫.

గీ. ఇవ్విధంబున నావిద్య లెల్ల మోటు। పడినఁ జె ట్టెక్కి చేతులు విడిచినట్లు
శోకచింతానిమగ్నుండనై కురంగ।నయన కృపఁ జూచి రక్షించు న న్నటంచు.

సీ. శరణంబు వేఁడ నాచంద్రాస్యతనువునఁ బొడమె గ్రక్కున దివ్యపురుషుఁ డొకఁడు
తద్దేహమున నవతార మయ్యె నొకండు వానిశరీరంబులోన నొకఁడు
రక్తారవిందపత్రవిశాలనేత్రుండు శతకోటిమార్తాండసముఁడు పుట్టె
నివ్విధంబున జనియించినమువ్వురు మాయమై పోవ నబ్జాయతాక్షి
వాలుఁగన్నులఁ దళుకులు జాలువాఱ। జిగురువాతెఱ ముసిముసి నగవుదేఱ
గుబ్బచన్నులఁ బయ్యెదకొంగు జాఱ। దాను నిలిచిన డాయంగ నేను బోయి. ౯౭.

సీ. పదఁతి నావేదసంపద యేల పస దప్పె నింతి నాశాస్త్రంబు లేల తూలె
నలినాక్షి నాపురాణము లేల నశియించె నెలనాగ నాగాన మేల చెడియె
వనిత నామంత్రవాసన యేల నుడివోయె లోలాక్షి నాయోగ మేల పొలిసె
నాతి నాతత్త్వవిజ్ఞాన మేల తొలంగె బాల నావైదుష్య మేల సమసెఁ
దెలియ వినిపింపు మనిన నాదేవి సరస। కిసలయాస్వాదమత్తకోకిలకలాప
కలమహాకారగర్వంబు గెలువఁ జాలు। కలికిపలుకులఁ దేనియ లొలుకఁ బలికె.

వ. ఓయి నారద బ్రహ్మవిద్యావిశారద నన్ను సకలశ్రుతికన్యకాజనజననపాత్రి నైన సావిత్రింగా నెఱుంగుము మదీయప్రభావంబుఁ జూపవలసి నీవిద్య లపహరించితి నింతియకాని యేనిమిత్తంబును లేదు నాదుశరీరంబునం బ్రాదుర్భవించినశృంగారకళాధురంధరుం డైనపురుషుండు ఋగ్వేదం బని పేర్కొనం దగిననారాయణుం డతండు సముచ్చారణమాత్రంబున నింధనంబుల గంధవహసఖుండునుంబోలె దురితంబుల దహించు నన్నారాయణువలన జనియించినమనోహరాకారుం డైనపురుషుండు యజుర్వేదం బని పేర్కొనం దగినబ్రహ్మ యతండు తూలంబుల వాతూలంబునుంబోలె దుష్కృతంబులం దూలించు నాబ్రహ్మవలన సంభవించినదివ్యతేజోమయుం డైనపురుషుండు సామవేదం బని పేర్కొనం దగినరుద్రుం డతండు తిమిరంబుల మిహిరుండునుంబోలెఁ గలుషంబుల విరియించు వీరుమువ్వురు నగ్నిత్రయంబును వేదత్రయంబును సవనత్రయంబును వర్గత్రయంబును వారు నీకుఁ దేటపడం బలికితి నని వేదాదివిద్యలు నాకుం గ్రమ్మఱ నిచ్చి మఱియును. ౯౯.

క. ఈసరసిలోన స్నానము। చేసిన గతజన్మములవిశేషములు నిరా
యాసముగఁ గానవచ్చు మహాసంయమితిలక స్నాన మాడుము దీనన్. ౧౦౦.

క. అని తా నంతర్ధానంబుఁ బొందె సుధాంశుబింబముఖి కాసారం
బున స్నాన మాడి యేనుం। జనుదెంచితి నిన్నుఁ జూడ జనపాలమణీ. ౧౦౧.

చ. అనవుడు నాప్రియవ్రతనరాధిపుఁ డిట్లనియెన్ మహాతపో
ధనునకు నీకుఁ దత్సరసిఁ దానము సేయఁగ నాత్మఁ దాన వ
చ్చినతొలిజన్మజాలములచేష్టితము ల్వినిపింపు నాకు నో
మునికులసార్వభౌమ మనముం జెవులుం బరితృప్తిఁ బొందఁగన్. ౧౦౨.

క. నావుడు నారదుఁ డిట్లను। సావిత్రీభాషణానుశాసనమున నే
నావేదసరసిఁ గ్రుంకిన। భూవల్లభ వేయిజన్మములు దోఁచె మదిన్. ౧౦౩.

సీ. విను వానిలో నొక్కజననప్రకారంబు మును చన్న కృతయుగంబున నవంతి
నా నొప్పుపుటభేదనంబున సారస్వతాఖ్యుండ నైనబ్రాహ్మణుండ నేను

సకలవేదంబులు శాస్త్రంబులును బురాణంబులుఁ బిన్నప్రాయంబునందుఁ
గరతలామలకంబుగా నభ్యసించి విఖ్యాతుల సుతులఁ బెక్కండ్రఁ బడసి
నాఁడునాఁటికి నిడుపులు వైఁడి గాఁగ। విత్త మార్జించి సంసారవృత్తివలన
రోసి జీవనభరణప్రయాస మెల్ల। నాత్మజులమీఁదఁ బెట్టి మోక్షాభిరతిని. ౧౦౪.

వ. తపంబు సలుప నూహించి కర్మకాండంబునం బుండరీకాక్షు నారాధించి యథో
చితక్రియావిశేషంబునం బితృగణంబులఁ దృప్తిఁ బొందించి వివిధాధ్వరవిధానం
బులఁ బురందరప్రముఖనిఖిలదైవతజాతులం బ్రీతులం గావించి పవిత్రాన్నదానం
బులం దక్కినజనంబుల వశీకరించి యిప్పుడు నీకుం జెప్పిన సారస్వతం బను సరో
వరంబునకుం జని. ౧౦౫.

ఉ. తత్సరసీసమీపవసుధాస్థలి నే వసియించి యిందిరా
వత్సుని భక్తవత్సలుని వారిజనాభునిఁగూర్చి ధైర్యభూ
భృత్సమబ్రహ్మపారము జపించెదుచోఁ బదివేలవేలసం
వత్సరముల్ పలాశఫలవాతజలాభ్యవహారలీలలన్. ౧౦౬.

స్రగ్ధర. సాక్షాత్కారంబు నొందెన్ సకలసురగణస్వామి విష్ణుండు లక్ష్మీ
వక్షోజస్వర్ణకుంభద్వయమృగమదసంవాసితాంగంబుతోడం
బక్షప్రక్షేపవాతభ్రమితనిఖిలదిక్పక్షివాహంబుతోడన్
రక్షఃకంఠేక్షణావిభ్రమలయరయనిర్వక్రచక్రంబుతోడన్. ౧౦౭.

గీ. ఇట్లు ప్రత్యక్షమైన లక్ష్మీశ్వరునకు। హరికి దండప్రణామంబు లాచరించి
మస్తకంబున ముకుళితహస్తయుగళి। చేర్చి యి ట్లని సంస్తుతించితి మహీశ. ౧౦౮.

క. పారావారశయాన ద।యారసపరిపూర్ణలోచనాంచల శ్రీమ
న్నారాయణ భువనావన। పారాయణ పరమపురుష పరపారగతా. ౧౦౯.

క. అత్యంతవీర్య నిర్గుణ। సత్యవిశుద్ధప్రభావ శాశ్వత నిఖిలా
దిత్యవిరోధిశిరోధి।క్షత్యారంభోపలంభచక్రాసికరా. ౧౧౦.

గీ. సూర్యశీతాంశునయన త్రిశుక్రసంస్థ। ధరణిధారణదక్ష త్రితత్త్వలక్ష్య
వాగ్వధూనాథజనక త్రివహ్నిభేద। విదళితాఖిలకలుష త్రివేదగమ్య. ౧౧౧.

క. నిరవధిసంసారార్ణవ। తరణీభూతాంఘ్రియుగ కృతత్రేతాద్వా
పరకలియుగములఁ దాల్తువు। నిరతము సితరక్తపీతనీలాకృతులన్. ౧౧౨.

గీ. సరవిఁ బుట్టించితివి ముఖాబ్జమున భూసు।రాన్వయంబును బాహుల నవనిపాల
వంశముఁ దొడల వైశ్యాన్వవాయమును బ।దముల శూద్రకులంబును గమలనేత్ర.

వ. కావున నీమహానుభావంబులు వారిజాసనాదులకు వాఙ్మానసగోచరంబులు గావు
మావంటివారికి గోచరించుట యెట్లు భవన్నామస్మరణైకశరణ్యుండ నైననన్ను
ధన్యుంగా ననుగ్రహింపు మని విన్నవించినఁ బ్రసన్నుం డై సకలప్రపంచసంచరిష్ణుం
డు విష్ణుండు ఘనాఘనస్తనితగంభీరస్వరంబున వరంబు వేఁడు మనిన. ౧౧౪.

క. ప్రాజ్యం బైనభవత్సా।యుజ్యము కృపసేయు నాకు నుద్భటరథినీ
రజ్యత్పరమారణమం।త్రజ్యాటంకారశార్ఙ్గధనురుగ్రకరా. ౧౧౫.

గీ. అనిన విని దేవుఁ డిట్లన నవధరించె। నలినభవునిదినావసానంబుదాఁక
నిలుము తరువాత నాతనివలన మహిమ। నెగడ జన్మింపఁగలవు జన్మించి పిదప.

క. నారము పానీయమునకుఁ। బే రానారంబు నీవు పితృగణములకుం
వారక యిచ్చుకతంబున। నారదనామంబు నీకు నలువ ఘటించున్. ౧౧౬.

సీ. ఆజన్మమున భూసురాన్వయతిలక సాయుజ్య మిచ్చెద నంచు నురగశాయి
చనినఁ దపఃక్రియాసంసక్తిఁ గొంతకాలంబు వర్తించి దేహంబు విడిచి
కలిసితి బ్రహ్మవిగ్రహమున నంత నానలువ దినావసానమున లేచి
మానసపుత్త్రులలో నన్నుఁ బుట్టించె నాదినప్రారంభ మాది సకల
భూతసృష్టికి నిది నాపురాతనోద్భ।వప్రకారంబు నాకు దేవత్వసిద్ధి
గలిగె హరిఁ గొల్చి నీవును గొలువుమీ నృ।పాల శ్రీహరి దురితషండాలిహరిని.

చ. అని పరమేష్ఠిసూనుఁడు ప్రియవ్రతరాజవరేణ్యుతోడఁ జె
ప్పినకథ కోలభర్త వినిపించిన భూరమణీలలామ యి
ట్లనియెఁ బురాతనుండు పరమాత్ముఁడు సర్వగుఁ డబ్జనాభుఁ డే
యనువున భావనీయుఁ డగు నత్తెఱఁ గెల్ల నెఱుంగఁ జెప్పుమా. ౧౧౯.

వ. అనవుడు నవ్వరాహదేవుండు ధరావరారోహ నాలోకించి. ౧౨౦.

గీ. మీనకమఠకోలమానవమృగకుబ్జ। జామదగ్న్యరామకామపాల
కృష్ణకల్కు లనుచు నెన్ను నీపదిరాజ। సావతారములు రమాధిపతికి. ౧౨౧.

క. పాపాబ్ధిఁ గడచువారికిఁ। దేపలు వైకుంఠరమణదివ్యాకృతివీ
క్షాపేక్షఁ నడచువారికిఁ। దాపలు ధరణీ దశావతారము లె సుమీ. ౧౨౨.

క. తమదృష్టికిఁ బరమము నా।ద్యము భవ్యము నవ్యయంబు నైనతదాకా
రము గాన రామి నెప్పుడు। నమరులు సేవింతు రర్చనాదుల మూర్తుల్. ౧౨౩.

వ. మఱియు రజస్తమోగుణప్రధానంబులు సమస్తలోకస్థితిపాలనాధీనంబులు వసుమతీ
వారివహ్నివాయువలాహకవర్త్మవాసరాధిపవనజవైరిక్షేత్రజ్ఞాభిధానంబులు నైన

మూర్తుల నస్మహానుభావుండు విశ్వప్రపంచంబు నిండి విహరించు నది నీవు నన్నడి
గినప్రశ్నంబునకు నుత్తరంబు. ౧౨౪.

క. నావుడు విని ముదితాత్మకు లై వసుమతి వెనుక నాప్రియవ్రతుఁడు సుధాం
ధోవాచంయమవచనము। దా విని యెవ్విధిఁ జరించె దంభకిరీంద్రా. ౧౨౫.

ఉ. ఆనతి యిమ్మటన్న వసుధా వసుధామనిభప్రభాధికుం
డైనప్రియవ్రతుండు ముని నంతట వీడ్కొని పోయి దేవపూ
జానియమావసక్తయతిసంతతిసంతతవాద్యమానఘం
టానిబిడీకృతతాత్మనికటం బగువేదసరస్తటంబునన్. ౧౨౬.

శా. నిష్ఠాతత్పరుఁ డై చతుర్దహనకుండీమధ్యవేదిం బదాం
గుష్ఠాగ్రంబున నిల్చి నిశ్చలత నర్కుం జూచుచున్ దైవత
శ్రేష్ఠున్ విష్ణుని బ్రహ్మాపారనుతి మెచ్చించె న్సముద్యత్తపో
నిష్ఠాతృప్రవరుం డితం డనఁగఁ బొందెన్ ముక్తిలీలావతిన్. ౧౨౭.

గీ. ఇది ప్రియవ్రతవృత్తాంత మింక నొక్క। పూర్వరాజన్యకథ విను పుణ్యగుణవి
ధేయుఁ డశ్వశిరోనామధేయుఁ డైన। రాజు గలఁడు వదాన్యత్వరాజరాజు. ౧౨౮.

మ. ధవళాంభోరుహనేత్ర వాఁడు హయమేధంబుల్ ఘటింపం దలం
చి విసంఖ్యధ్వజినీపరంపర నుదీచీప్రాచ్యవాచీప్రతీ
చ్యవధిక్షోణికి యజ్ఞముక్తహరిఁ గాయం బంపి కావించె జా
హ్నవికిన్ శాత్రవకంఠరక్తనదికిన్ సాపత్న్యసంవాదమున్. ౧౨౯.

శా. ఈరీతిం గకుబంతముల్ గెలిచి తా నేకాగ్రబుద్ధిన్ వచః
శ్రీరేఖాచతురాస్యు లైనమును లార్త్విజ్యంబు గావింప నా
నారాజన్యులు భృత్యులై మెలఁగ భండారంబులం గల్గుబం
గారంబుల్ వెదచల్లె విప్రులకు వేడ్కన్ వాజిమేధంబునన్. ౧౩౦.

వ. ఇబ్భంగి సాంగంబుగాఁ దురంగమేధాధ్వరంబు చేసి నిజభుజప్రతాపతపనచ్ఛవిచ్ఛ
టాసిందూరితదిక్కరిశిరుం డశ్వశిరుండు శుద్ధాంతకాంతాసహస్రంబులతోడ నవ
భృతస్నానం బాచరించి కృతార్థుం డై రెండవమహేంద్రుండునుం బోలె భూసు
రాశీర్వాదంబులు సౌవిదల్లసాహోనినాదంబులు వందిజనపఠ్యమానబిరుదగాథార
వంబులు ధవళచామరధరకరకంకణక్వణనంబులు మాగధమధురగా
నంబులు భేరీమృదంగదుందుభిధ్వానంబులుఁ గ్రందుకొన సభామండపంబునకు
వచ్చి నవరత్నసింహాసనంబున నాసీనుం డయ్యె నయ్యవసరంబున. ౧౩౧.

క. యోగిప్రవరులు కపిలుఁడు। జైగీషవ్యుండు సభకుఁ జనుదెంచుటయున్
జాగిలి నరనాయకుఁ డ। భ్యాగతపూజనము సేసి పలికెం బ్రీతిన్. ౧౩౨.

గీ. యోగివరులార సందేహ మొకటి మిమ్ము। నడుగ వచ్చెద ననఁగ మీయంత వేగు
దెంచినా రాడఁ బోయినతీర్థ మెదురు। గాఁగ వచ్చినకరణి భాగ్యంబుకతన.

క. మాయావివర్జితుఁడు నా। రాయణుఁడు పురాణపురుషుఁ డనవద్యుఁడు దా
నేయేవిధములఁ గొలువ వి। ధేయుం డగు నానతిండు తెలియఁగ ననుడున్. ౧౩౪.

క. నానాభువనంబుల మే। మే నారాయణుల మనుచు మెలఁగుదు మీపా
టేని వివేకదశం గన। వో నారాయణుఁ డనంగ నొక్కఁడు కలఁడే. ౧౩౫.

క. మఱచియు నిట్లాడకు పుడ। మి ఱేఁడ ప్రత్యక్ష మైతి మిప్పుడ మమ్మి
ద్దఱ నారాయణులంగా। నెఱుఁగుము విచికిత్సఁ బొంద నేటికి నీకున్. ౧౩౬.

వ. అనిన వార లాడినతుచ్ఛారంబులు కర్ణకఠోరంబు లగుటయు నశ్వశిరుం డవనత
శిరుండై కొండొకవడి విచారించి సవినయంబుగా నిట్లనియె. ౧౩౭.

క. మీ రెఱిఁగినంత యెఱుఁగుదు। నే రాజీవాక్షుమహిమ ఋషులార వినం
గా రా దిది వో శ్రీమ। న్నారాయణు నుడుగ వచ్చునా యెవ్వరికిన్. ౧౩౮.

మ. హరితోఁ గౌస్తుభవక్షుతో గరుడవాహారూఢుతో శంఖశా
ర్ఙరథాంగాదివిభాసమానకరుతో రాజీవపత్రాక్షుతో
దొరయంగా నరుఁ డెట్టివాఁడును సమర్థుండే మహేంద్రాదిని
ర్జరు లాదేవునిపాదసేవకులు గారా మీరె చర్చింపుఁడీ. ౧౩౯.

క. అనవుడు విని పెలవులు వా। ర నగుచుఁ దమతపముపోతరంబున నైనం
గనుఁగొనుమీ నారాయణు। నని పలికి సభాజనంబు లాశ్చర్యపడన్. ౧౪౦.

శా. ఈషన్మాత్రములోపలం గపిలయోగీంద్రుండు నీలాంబుదో
న్మేషంబు న్నిరసింపఁ జాలుతనుకాంతిశ్రీలు దిగ్భాముల్
భూషింపంగ నిజాలకుం బరమవిష్ణుం డైన వేవేగ జై
గీషవ్యుండు వహించె నవ్విభునిఁ బక్షిస్వామియై మాపునన్. ౧౪౧.

క. అప్పుడు భయవిస్మయములు। ముప్పిరిగొన నశ్వశిరుఁడు ముందట పైపై
నుప్పరము తెగయ గరుడుని। కొప్పరమున నున్నకపటగోవిందునకున్. ౧౪౨.

గీ. మ్రొక్కె నిది గాదు విష్ణునిమూర్తి నాభి। నుండవలెఁ బుండరీకంబు పుండరీక
భవనమున నుండవలె బ్రహ్మ బ్రహ్మతోడల। నుండవలె రుద్రుఁ డట్లు గాకున్న మిథ్య.

మ. వెడవాయల్ విడువుండు మీ రనవుడున్ విద్యాప్రభావంబునం
బొడమాపెం గపిలుండు పంకరుహనాభుండై మరందంబు చి

ల్కొడునత్తాపుర నుంచి బ్రహ్మ నలజైగీషవ్యుఁడు న్వానిపెం
దొడ నిల్చెం బనిబిద్ధచందమున రుద్రుం డర్కకోటిప్రభుఁ. ౧౪౪.

గీ. అది కనుంగొని యిదియు మాయాబలంబు। విశ్వరూపధరుండు శ్రీవిష్ణుఁ డనుచు
ధారుణీభర్త పలికిన నోరిమాట। నోర నే యుండెఁ దత్సభాగారమునను. ౧౪౫.

సీ. కనుపట్టె నొకచోట గండభేరుండంబు లొకవంకశరభంబు లుద్భవించె
నావిర్భవించె సింహము లొక్కదిక్కున నొకచాయ బెబ్బులు లుప్పతిల్లెఁ
దలచూపె నొకచక్కి దంతావళంబులు జనియించె నొకమూల సైంధవములు
పొడకట్టె నొకవక్క భూమిదారంబులు మహిషంబు లొకగొంది మంద గూడె
నొక్కపట్టునఁ బుట్టె మయూరకీర। కోకిలమరాళకుక్కుటఘూకకాక
మశకమత్కుణమక్షికామనుపశలభ। దందశూకాదిజంతుకదంబకంబు. ౧౪౬.

క. అంతట నశ్వశిరోభూ।కాంతుఁడు సంయములమహిమగా మనమున సి
ద్ధాంతీకరించి నిటలు। ప్రాంతపరిన్యస్తహస్తపంకేరుహుఁడై. ౧౪౭.

ఉ. ఓపరమాత్ములార కరుణోదధులార నితాంతయోగవి
ద్యాపరతంత్రులార తెలియ న్వశమే భవదీయమైనయా
నైపుణి చాలుఁ జాలు ననినన్ నిజమూర్తులు దాల్చి తాపసుల్
జాపరమేశ్వరా యనిన జంతువు లన్నియుఁ బోయె మాయమై. ౧౪౮.

వ. ఇట్లు మహాశ్చర్యంబైనయోగవిద్యాచాతుర్యంబునం బెక్కుపోకలం బోయి నిల్చిన
మహామునులం గాంచి కలగాంచి మేలుకాంచినచందంబున డెందంబు చలింప
నిలింపవల్లభనిభుం డమ్మహీవిభుండు దండప్రణామంబు లాచరించి మీరు నాకుం
జూపినబహురూపంబుల మొఱంగుతెఱంగు మఱుంగుపెట్టక యెఱింగింపుం డనిన
జగజ్జనసంసేవ్యులైనకపిలజైగీషవ్యులు మందస్మితంబు వదనారవిందంబులం గంద
ళింప నరనాయక నీవు నారాయణుం డెవ్విధంబునం గొలుచ విధేయుం డగునని
మమ్ము నడిగితివి నారాయణుండు సమస్తంబునుం దన్నకా భావించి కొలిచినం
గాని విధేయుండు గాఁడు సమస్తంబు నతం డగుట నీకుం దెలుపవలసి నారా
యణగుణవిలాసములు చూపితిమి యిది మాయగా విచారింపవలవదు నారాయ
ణుండు సమస్తపరిపూర్ణుం డని భావంబున దృఢీకరించి నానావిధోపచారంబుల
వైదికాచారంబుల ననుదినస్నానదానజపహోమాదిపుణ్యకర్మసమర్పణంబుల బ్రా
హ్మణసంతర్పణంబుల నారాధింపుము విధేయుం డయ్యెడు మాచెప్పినపరమజ్ఞాన
సద్భావంబు వదలకు మెండియు నడుగవలసినసందేహంబు లడుగుము. ౧౪౯.

క. అనవుడుఁ గపిలుం గనుఁగొని జనపాలకుఁ డడిగె మోక్షసంపద కర్హం
బునఁ గలదో విజ్ఞానంబునఁ గలదో యెఱుఁగఁ జెప్పు మునికులతిలకా. ౧౫౦.

వ. అని కపిలమునీశ్వరు నశ్వశిరుం డడిగె నని వరాహదేవుండు చెప్పిన మహీమత్త
కాశిని మీఁదటివృత్తాంతం బానతిమ్మని విన్నవించిన. ౧౫౧.

మ. మణిమంజీరవిలంబమాన బలవన్మత్తాహితవ్యూహాభీ
షణసంగ్రామధరాధనంజయవిభాసంపన్న నీరేరుహే
క్షణపూజాపరతంత్ర సాళ్వనరసింగక్ష్మాధ్యక్షద
క్షిణదోర్దండ నిరంతరాయకరుణాశ్లేషప్రియంభావుకా. ౧౫౨.

క. భూసురసహకారవనీ వాసంతవిలాస విబుధవత్సల సకలా
శాసందర్శితగుణహల్లీసక మదవైరిమండలీఫణిగరుడా. ౧౫౩.

ఉత్సాహ. మండువా బెడందకోట మాహురాది మేదినీ
మండలేశ్వరస్తుతాసమానమానుషోదయా
భండనాజితప్రచండపటహనిస్వనార్భటీ
హిండితాష్టదిక్కుడుంగ యీశ్వరాత్మసంభవా. ౧౫౪.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధసారసారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభి
ధాన ఘంటనాగయప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతం బైన శ్రీవరాహపురాణం బనుమహా
ప్రబంధంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ

# వ రా హ పు రా ణ ము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీవేంకటాద్రిపతిసం। సేవాహేవాకనిపుణ శేషాహిఫణా
శ్రీవినమనకరకరిసే। నావిభ్రమ యాశ్వరేంద్రునరసింహనృపా. ౧.

వ. అవధరింపు మవ్వరాహదేవుండు ధాత్రి కిట్లనియె. ౨.

గీ. అట్లు దన్ను మహీకాంతుఁ డడుగఁ దపసి। పలికె నరపాల మున్ను గీష్పతి నడిగిరి
బ్రహ్మసుతుఁ డైనరైభ్యుండు రాజవర్యుఁ। డైనవసువును నీవు న న్నడిగినట్లు. ౩.

సీ. అది విను చాక్షుషం బైనమన్వంతరంబున బ్రహ్మవంశవర్ధనుఁడు వసువు
నృపరత్న మొకనాఁడు నీరజాసనుఁ గొల్వ నేగుచోఁ దెరువున నెదురుపడ్డ
సకలవిద్యాధరస్వామి చైత్రరథుండు విబుధవర్గంబు సేవింప నలువ
గొలు వయి యున్నాఁడు గొబ్బునఁ బొమ్మని చెప్ప హుటాహుటిఁ జేర నరిగి
నిలిచె మూపును మూపును దొలఁగఁ ద్రోవ। రానిసందడి గని పద్మరాగరత్న
ఖచితహాటకమయకుంభరుచిపరంప। రానిరాఘాట మగుహారంబుకడను. ౪.

క. ఆసమయంబున రైభ్యమ। హాసంయమి యేగుదేర నర్ఘ్యాదివిధుల్
చేసి వసున్నృపతి యెటు వి। చ్చేసెదవు మునీంద్ర నాకుఁ జెప్పు మటన్నన్. ౫.

క. అనిమిషగురుండు చతురా। నను సేవింపంగ వచ్చినాఁ డని విని యేఁ
బనివడి చనుదెంచితి నా। తని నొకసందేహ మడుగఁ దలఁచి నృపాలా. ౬.

క. అని రైభ్యుఁడు వసునరపా। లునకుం జెప్పంగ నంతలో నంబురహా
సనుఁ డనిపినఁ దమతమకే। తనములుఁ గరితురగరథపదాతులు మెఱయన్. ౭.

సీ. నడిచె నింద్రుండు కిన్నరకాహళులు మ్రోయ గమనించె శిఖి డిండిమములు మ్రోయఁ
జనియె దండధరుండు జయదుందుభులు మ్రోయ వెళ్లె దైత్యుఁడు గిడిగిళ్లు మ్రోయఁ
బోయె నంబుధిరాజు బూరగొమ్ములు మ్రోయ జరగె వాయువు మురజములు మ్రోయ
నరిగె యక్షుండు కిన్నెరవీణియలు మ్రోయఁ గదలె రుద్రుండు శంఖములు మ్రోయ

నిట్లు దివికి సుధాంధసు లెల్ల నేగ। గొంతతడవునకు బ్రహ్మవిద్యోపలుప శిష్య
సముదయముఁ దానుగత్యాంతరములుగడచి। వచ్చె సురదేశికుఁడు బహిర్ద్వారమునకు.

క. ఆవేళ రైభ్యవసువసు।ధావరు లాంగిరసుచే యథాసముచితపూ
జావిధులు వడసి నందితు।లై వెంటం జనిరి దివికి నఘగిరిపవికిన్. ౯.

మ. చనిన న్వారును దాను జీవుఁడు నిజాస్థానీనివాసాంతరం
బున లీలాపరికల్పితైందవశిలాభూమిన్ సుఖాసీనుఁడై
మునికంఠీరవ భూమిభృత్తిలక మమ్ముంగూర్చి మీ రేగుదెం
చినకార్యంబులు చెప్పుఁడా తెలిపి నిశ్చింతాత్ములం జేసెదన్. ౧౦.

వ. అనవుడు. ౧౧.

క. అమరేంద్రమంత్రితో రైభ్యమహాముని పలికె ముదితుఁడై మోక్షము క
ర్మమునం గలదో సుజ్ఞానమునం గలదో వచింపు నావుడు గురుఁడున్. ౧౨.

క. నలినీపత్రము సలిలంబులఁ బొరయనిరీతి నుత్తముఁడు సత్కర్మం
బులు గాని దుష్కర్మంబులు గాని హరికి నిచ్చి పొరయఁడు వానిన్. ౧౩.

గీ. ఏతదర్థంబు గాఁగ మునీంద్ర తొల్లి। విష్టరకనామకీకటవిభునితోడ
నత్రిగోత్రసముద్భవుఁడైనసంయ। మనుఁడు చేసినతర్కంబు వినుము నీవు. ౧౪.

మ. ఘనుఁ డాసంయమనుండు తీర్థములు ద్రొక్కం బోవుచో ధర్మకా
ననమధ్యంబున విదికాపపనసన్నాహంబు దేహంబు ముం
ప నిజస్వాంతము పల్లవింపఁ గనియెన్ భాగీరథిన్ నర్మో
పనిరాసార్థపదద్వయీవినతికృత్పాథోజభూసారథిన్. ౧౫.

మ. కని తత్తీరవనాంతరంబునఁ గురంగశ్రేణి వెంటన్ గృతాం
తునిరీతిన్ బఱతెంచువిష్టరకు ధానుష్కుం గుణారోపితా
స్త్రుని రక్తాక్షుని జూజురుందలకిరాతున్ ముందరం జూచి చే
త నివారించుచుఁ బల్కెఁ బెద్దగొద నత్యంతానుకంపాత్ముఁడై. ౧౬.

క. ఓయి నిషాదకులేశ్వర యేయకుము మేయకుము జీవహింసకు నేలా
కోయవు చెల్లుబో నీ కేయపకారంబు చేసె నీలేళ్ళనికన్. ౧౭.

శా. అవ్వాక్యంబు నిరాకరించి దిశ లల్లాడం గఠోరంబుగా
నవ్వెన్ నవ్వి నిషాదభర్త మృగసంతానంబుఁ జంపంగ నే
నెవ్వాఁడం బరమాత్మ గాక పిసవెఱ్ఱి విప్ర యాచీఁకటుల్
ద్రవ్వింపం బనిలేదు నుఱ్ఱు మముఁబోట్లన్ వీరివారిం బలెన్. ౧౮.

గీ. శిశువు మంట నెద్దఁ జేయుచుఁ జెలుచుచు। నాడునట్లు పోతె నఖిలభూత
సృష్టిఁ దాన చేయుఁ జెలుచు నప్పరమాత్మ। యిది నిజంబు సంశయింప వలదు.

గీ. విశ్వ మాత్మప్రణీతమై వికృతిఁ బొందు। నందులోన నహంభావ మనుచితంబు
గా నెఱింగి వివేకులు మానిరనిన। విని మహాశ్చర్యమున సంయమనుఁడు పలికె.

క. లుబ్ధక దూర్వాచర్వణ। లబ్ధి నిజస్వాంతసమ్మిళత్పరమానం
దాబ్ధినిమజ్జన్మృగవధ। లుబ్ధుండవు నీకు నీపలుకులుం దగునే. ౨౧.

సీ. అనిన లుబ్ధకుఁడు వీపున నున్న లోహపువల దెచ్చి ముందర వైచి దీని
లో వహ్ని దరికొల్పు నావుడు ధరణీనిలింపోత్తముండు మండింప లేక
దేశస్థ మయ్యు హుతాశి గన్నులవెంట వేర్వేర కీలలు వేయఁ జూప
జాలంబు కాదంబగోళంబువలె నొప్పె నప్పుడు బోయ సంయమునిఁ జూచి
యోయి సంయమి వీనిలో నొక్కకీలఁ। గైకొనుము నీవు గ్రక్కునఁ గడమకీల
లార్పవలె నన్న నాతఁడు నట్ల చేయ। నీరు మిన్నంటు జ్వాలల నాఱ జల్లె. ౨౨.

గీ. ఇవ్విధంబున వలలోనియింగలంబు। చల్లగా నార్చి కీకటస్వామి పలికె
ఋషికులోత్తమ యిఁక నాకు నిమ్ము నీవు। గైకొనినకీలఁ గఱకుట్లు గాల్పవలయు.

వ. అనిన విని మునిశ్రేష్ఠుం డాయసానాయంబు డాయం బోయి తదంతరాళంబున నిజగృహీతజ్వాలంబ యేల మొదలికి దహనలేశంబునుం గానక హీనకళాస్యంబు తోడ నపహాస్యంబునకు నాస్పదంబై రిచ్చవడి వెచ్చ నూర్చినం గనుంగొని విష్టరకుండు మహాత్మా హుతాశనుండు మూలనాశనంబునం బొందిన బహుముఖశిఖానికాయంబు మాయం బైనచందంబునఁ బరమాత్ముండు ప్రకృతిస్థితుం డైన భూతంబులు సంతతియాభూతంబులగు నతండు వికృతుం డైన నెండియుఁ బ్రభూతంబులగు నిది సకలప్రపంచస్థితి శరీరగ్రహణధర్మంబున నెవ్వనికి నెద్ది విహితం బక్కర్మంబు చేసి పరమాత్మునికి సమర్పించెనేని వాఁడు ఫలంబులం బొరయం డని చెప్పె నప్పుడు. ౨౪.

క. పరతత్త్వవిదుం డగువి।ష్టరకునిమస్తకముపై దిశాభాగములం
బరిమళము పోఁడు ముట్టఁగ। సురభూరుహపుష్పవృష్టి జోరునఁ గురిసెన్. ౨౫.

మానిని. మాతరుణీపతి మన్ననఁ బంప విమానము లంబరమార్గసమా
యాతము లయ్యెఁ దదంతరసీమల నన్నిట యోగబలాతిశయ
ద్యోతకమూర్తులతో విహరించుచుఁ దోఁచెఁ గృపారసధూర్ధరుఁ డ
ద్వైతవివేకనిధానము చెంచు శతక్రతుముఖ్యులు దన్నుఁ గనన్. ౨౬.

చ. తదవసరంబునం బరమతత్త్వము విష్ణు ననేకమూర్తిగా
హృదయములో నెఱుంగుకొనుమీ కను మీ వనినట్లు యోగసం
పదమహిమన్ విమానములపై శబరాగ్రణి పెక్కురూపులై
చదలఁ జరింప వానిఁ గని సమ్మదనీరధి నోలలాడుచున్. ౨౭.

క. విష్టరక నిన్నుఁ బోలఁ ద్రివిష్టపమున లేరు తత్త్వవిదు లని లబ్ధా
భీష్టత సంయమనమహాముష్టింపచపతి నివాసమునకుం జనియెన్. ౨౮.

సీ. కావున నేతత్ప్రకారసుజ్ఞానంబు గలిగి స్వజాతీయకర్మతత్ప
రుం డైనవాఁడు ముక్తుం డని గీష్పతి బోధింపఁ దెలిసి రైభ్యుండు వసువు
నాత్మగేహములకు నరిగిరి నీవు నద్వైతమార్గంబున వాసుదేవు
సేవింపు మశ్వశిరోవసుధాధీశ కలుగు మోక్షం బని కపిలమౌని
చెప్ప నాతఁడు గడు సంతసిల్లి భూవధూలలామకుఁ దనపుత్రు స్థూలశిరుని
భర్తఁగాఁ జేసి చనియెఁ దపస్విజనశరణ్యమునకును నైమిశారణ్యమునకు. ౨౯.

క. చని తత్కాననమధ్యంబున భూపాలుండు యజ్ఞమూర్తిస్తుతి య
జ్ఞనరున్ గురు నారాధించె నని వరాహంబు చెప్పెఁ జెప్పిన మఱియున్. 3౦.

గీ. పృథివి యిట్లను యజ్ఞమూర్తిస్తుతిప్రకార మానతి యిమ్ము భూదారవర్య
వినఁగవలె నన్న దేవుండు ఘనఘనాఘనార్భటీవిస్ఫుటోక్తి నిట్లని వచించె. 3౧.

సీ. బ్రహ్మరుద్రమహేంద్రపావకపవమానవిధువిభాకరముఖ్యవిబుధయాజ్య
శశిసూర్యనేత్ర భాస్వరదంష్ట్ర వత్సరాంశాయనకుక్షి దర్భాంగరోమ
యిధ్మసక్థి జగత్త్రయీయాదిశాభ్యంతరవ్యాప్తశరీర విశ్వప్రసూతి
సకలదేవాసురజయనిమిత్తానుయుగాంగీకృతైకనరావతార
యజ్ఞమూర్తి శుభ్రభృత్సన్నిభాంగ యీశ యిజ్య పరమాణుతుల్య యోగీంద్రపూజ్య
హరి జనార్దన మూర్ధసహస్ర పరమ వేదవేదాంగవేదాంతవేద్య నిత్య. 3౨.

క. ఈసకలము చతురాస్యుఁడవై సృజియింపుదువు చక్రివై కాతువు లీ
లాసంపన్నత రుద్రుఁడవై సమయింపుదువు నీవ యజ్ఞనరేంద్రా. 33.

వ. సంసారచక్రచంక్రమణక్రమణసంక్షయకాంక్షు లైనమహానుభావులకు సేవ్యుండవు
నీవ దేవా నీమానసంబున మానసంబును నీనేత్రంబుల నేత్రంబులు నీశరీరంబున
శరీరంబును సమర్పించినవాఁడ నన్యథా శరణంబు లేనివాఁడ నన్నుం గృతార్థునిం
జేయు మని యజ్ఞమూర్తిస్తోత్రంబునఁ బ్రార్థించినఁ బ్రసన్నుండై యజ్ఞనరుండు స
హస్రకరసహస్రదుస్సహమహోమహోనివహం బై తనపురోభాగంబున వెలుంగ నందు
నశ్వశిరోనరేశ్వరుండు లయంబునం బొందె నని చెప్పిన వరాహస్వామికి భూమి
యిట్లనియె. 3౪.

క. రైభ్యుఁడు వసుభూపతియు సుధాభ్యవహారగురుతోడ నద్వైతజ్ఞా
నాభ్యాసము చేసి తదీయాభ్యున్నతి నేమి యైరి హరికిరివర్యా. ౩౭.

చ. అనవుడు దేవుఁ డిట్లనియె నట్లు బృహస్పతిచేత బోధముల్
విని వసుభూవిభుండు దనవీటికి నేగి జగజ్జనానురం
జనకరుఁడై వసుంధర భుజాభుజగంబునఁ దాల్చి శాత్రవా
వనిపులఁ గూల్చి విష్ణుని వివర్జితభేదమునం భజించుచున్. ౩౮.

ఉ. చేసె ననేకయాగములు జీవనసౌఖ్యము నెమ్మనంబునన్
గోసె వివస్వదాహ్వయతనూజునిపై నిజరాజ్యభారమున్
వేసె వివేకనిష్ఠురలవిత్రముచే నఘపాశబంధముల్
గోసెఁ బురీనివాసమునకుం బెడఁబాసె బుధుల్ నుతింపఁగన్. ౩౯.

వ. ఇట్లు సంగపరిత్యాగంబు గావించి తపోవనంబునకుం జని కాశ్మీరవల్లభుండు పుండ
రీకాక్షపారస్తవంబు జపించుచు నియతాత్ముండై. ౩౫.

క. పుష్కరతీర్థతటంబున దుష్కరతప మాచరించి తుది ముందట నా
విష్కారంబునఁ బొందిన పుష్కరపత్రాక్షుదేహమున లయ మయ్యెన్. ౩౬.

గీ. నావుడు మహావరాహంబునకు ధరిత్రి దేవ నీభర్తరాలికిఁ దెలియఁ జెప్పు
పరమనుతిఁ బుండరీకాక్షపారమును వసుక్ష్మాపాలనాథుని మోక్షగతియు. ౪౦.

వ. అనిన నద్దేవుండు సవిస్తరభాషావిశేషంబున. ౪౧.

గీ. అఖిలవేదాంతవేద్య మహం భజామి సంభవక్షయరహిత మహం భజామి
సాసిచక్రాబ్జశార్ఙ్గ మహం భజామి కుంభసాగరశయన మహం భజామి. ౪౨.

పృథ్వి. నమామి మధుసూదనం నవపయోదనీలత్విషం
నమామి పరమేశ్వరం నఖరభిన్నరాత్రించరం
నమామి పురుషోత్తమం నలినగేహినీనాయకం
నమామి కరుణాస్పదం నగధురీణతాదక్షిణం. ౪౩.

వ. అని వసుమహీశ్వరుండు సంస్తుతించె నిది పుండరీకాక్షపారస్తవంబు వెండియు
నతండు పుండరీకాక్షు నుద్దేశించి మహాత్మా చరాచరప్రపంచంబున నెద్దియు భవ
ద్వ్యతిరిక్తంబు లేదు సర్వంబును భవన్మయంబకా నెఱింగినవాఁడ నని పలుకునవ
సరంబున వానిశరీరంబువలన. ౪౪.

సీ. గిరికొన్నపల్లజుంజురువెండ్రుకలవాఁడు మిసమిస మనుమిట్టనొసలివాఁడు
కోరచూపులరెట్టచేరుగ్రుడ్డులవాఁడు బైసిమాలినమ్రానిపణతవాఁడు

కొడవంటివంకలనొగ్గిపండులవాఁడు దుమ్ము పట్టినబొక్కిలొమ్మువాఁడు
గాటంబుగా నిర్లు గవియుదేహమువాఁడు కడు నక్కళించినకడుపువాఁడు
వైపు దప్పినచేతులవాఁడు మొద్దువ్రేళ్ళవంకరకొంకరకాళ్ళవాఁడు
కులుచవాఁడు వికారపుగూనివీఁపువాఁడు కాలినకొఱడుభావమున వెడలె. ౪౫.

గీ. వెడలి సాంజలియై వసూర్వీకళత్ర। నన్నుఁ బనిగొమ్ము నావుడు నిన్నుఁ బనిగొ
నంగ నేటికి నాకు నీనామ మేమి। యేకతానకు వచ్చితిరా కిరాత. ౪౬.

గీ అనినఁ గాశ్మీరపతికి ని ట్లనియె వాఁడు। తొంటిభవమునుండి నీవెంటవెంట
నంటువాయని నీబ్రహ్మహత్యఁగాని। యేఁ గిరాతుండఁగాఁ జుమీ నృపవరేణ్య.

సీ. అది యెట్టి దనిన నీ వవధరింపుము గతకలియుగంబునఁ జాంద్రకులమునందు
జనియించి యామ్యదిశావధూచరణమణీనూపురము జనస్థానపురము
పరధరిత్రీనాథు లరిగాపులై భజింపఁగ నేలి దోఃప్రతాపమున వ్రాలి
కరులు వాజులు శతాంగములు పదాతులు వెంటరా నొకనాఁడు వేటవెడలి
కాననము చొచ్చి శార్దూలఖడ్గసూకరప్రముఖజంతుసంతతి వ్రచ్చి నచ్చు
సారసంబున మృగవేషధారి యైన। యతికులస్వామిఁ గూలనేసితివి నీవు. ౪౮.

గీ. ఏయుటయుఁ గొంతదూరంబు పోయి మృగము। ప్రస్రవణశైలకందరాభ్యంతరమునఁ
బరమతాపసవేషియై పడియెఁ బడిన। నది నిజాలకు సారంగ మనుచు డాసి. ౪౯.

క. కృతకహరిశాతనఖర। ప్రతిభటశాతాంబకప్రపాతాంగవిని
గ్గతరక్తసిక్తమునిసులపతి వీక్షించితివి గుండె బగ్గునఁ బగులన్. ౫౦.

మ. మునిచూడామణి నట్లు చూచి భయసంపూర్ణాంతరంగుండవై
కనుగెందమ్ముల జాఱి మేన వఱదల్ గట్టంగ బాష్పాంబువుల్
వనికావాటికి వేఁట రారె హరిణవ్రాతంబులం జంపరే
కనిరే పాతకి నైననేను బలె దుష్కార్యంబు ధాత్రీపతుల్. ౫౧.

సీ. అక్కటా పరమసంయమిఁ జంపి క్రమ్మఱఁ బురికి నే నేమని పోవువాఁడ
నాసరిమేదినీనాథులలోన నే నేచందమునఁ దలయెత్తువాఁడ
నేతరంబున లేనియియ్యపకీర్తిపంకంబు నే నేమిటఁ గడుగువాఁడ
దరిదాపు లేనిదుస్తరపాతకాంబునిధానంబు నే నెట్లు దాటువాఁడ
ననుచుఁ బెక్కువిధంబుల నడలి బడలి। వేదనానలశిఖలచే వెచ్చి నొచ్చి
కారణము లేక తగిలినకల్మషంబు। బయలుపడనీక మనసునఁ బదిలపఱచి. ౫౨.

క. మాటికి నిఁక సంసారం। బేటికి ననుబుద్ధి పుట్టఁ బృథ్వీశ్వర న
న్నేటికి నెదు రీఁదినగతి। వీటికి వచ్చితివి మరలి విన్నఁదనముతోన్. ౫౩.

శా. ఆవేళ న్నిట్లుఁ జూచి బాంధవచమూపామాత్యవర్గంబు చిం
తావైకల్యముతోడ భూపతికి మానం బేల వాటిల్లె నే
లా వాడె న్వదనంబు నేత్రముల నేలా తొట్టె బాష్పంబు లే
లా వైవర్ణ్యము దోఁచె దేహమున నేలా పుట్టె నిట్టూరుపుల్. ౫౪.

క. అని సంశయింప బాంధవ|జనముల సేనాధిపతుల సచివులఁ జేస
న్నసె పొం డని శుద్ధాంతం|బునకుం జని బ్రహ్మహత్య మొగమున వేలన్. ౫౫.

సీ. ఉబుసుపోకకు నైన నొల్లవు చెవిఁ జేర్ప వైణికవల్లకీవాదనములు
క్రేఁగంట నైన వీక్షింపవు శుద్ధాంతకామినీమణులశృంగారకళలు
పెనుబండువున నైనఁ బెట్ట నూల్కొనవు కట్టాణిముత్యంబులహారలతలు
కల నైన నును మేన నలఁదవు పన్నీటఁ గలపినకాశ్మీరకర్దమములు
మఱచి యైన విహారరమ్యస్థలంబు| చేర నరుగవు సుకృతలక్ష్మీవియోగ
వేదనాదూయమానమనోదురంత| చింతఁ జీకాకు పడి మహీకాంత నీవు. ౫౬.

వ. ఇవ్విధంబున శరీరసౌఖ్యంబువలన వైముఖ్యంబును సకలసామ్రాజ్యోపకరణంబుల
వలన నిరాకరణంబును మృగయావినోదంబులవలన ఖేదంబును వహించి సహించి
నిలువరాని బ్రహ్మహత్యాపాతకంబు నివర్తింప విచారించి శ్రీహరిప్రీతిగా సువ్రతం
బులు సలుప నుద్యోగించునవసరంబున. ౫౭.

ఉ. పిట్టలవాతు లెండ నలిబృందముపాటలవారి నీడ ని
ట్టట్టు చనంగ రాక ఘను లాఁకట నుండఁ గభస్తిమచ్ఛిలా
పట్టికలన్ హుతాశనుఁడు బగ్గన మండ ధరిత్రిమీఁదఁ జూ
పట్టి రసాలసాలములు పండ నిదాఘము వచ్చె నుగ్రమై. ౫౮.

క. ఆసమయంబున శైలగు|హాసీమల మండు వనహుతాశనము నృపా
లా సతతము నీహృదయము|లో సంతాపాగ్ని వోలె లోలార్చులచేన్. ౫౯.

చ. సమత సమస్తచిత్తముల సంతతమున్ విహరించుఁ గాన దై
వము మదనుండె తథ్య మని వంచన యించుక లేక యెండచేఁ
గమలపుటీకటాహములఁ గ్రాఁగెడు తేనియనూనెఁ దప్తమా
షము దొడికెన్ మదభ్రమరజాలము గేలిసరోవరంబులన్. ౬౦.

క. పెనుగాలి చఱచి కొట్టిన| వినువీధికి నెగసి ధూళి విలసిల్లె మహీ
వనజేక్షణ తీవ్రతాప|మునకు వెఱచి పెట్టుకొన్న ముసుఁగును బోలెన్. ౬౧.

గీ. నీరనిధిరాజు కరుణించి నిష్ఠురాత|పంబుచే నొచ్చె నని భూతలంబు శీత
లంబు సేయంగఁ బంపినలహరు లనఁగ| నెండమావులు గనుపట్టె నెల్లకడల. ౬౨.

క. ఎండకు నోర్వఁగఁ జాలక। కొండలు మొఱవెట్టె ననఁగఁ గోల్వులు గుహా
మండలములనుండి మహా।తుండంబులు దెఱచి ఘోంకృతులు గావించెన్. ౬౩.

సీ. జిలిబిలిమంచు కించిన్మాత్రమును లేక పంచబంగాళమై పాఱిపోవ
చల్లదనం బెల్లఁ బల్లవాధరలనిబ్బరపుబ్బుపాలిండ్లపంచ నొదుగ
నుదకంబు తెకతెక నుడుక నీడకి రాక మడుగులమీనంబు లడుగుచేర
దశదిశాంతరములఁ దఱచుగా విస్ఫులింగములు గ్రక్కుచు వడగాలి సుడియ
నధ్వనీనులగుండియ లవియ వాడి। చూపె మల్లీలతావల్లరీపరాగ
ధూసరంబులు దప్తముక్తాసరములు। మాసరంబులు నైదాఘవాసరములు. ౬౪.

వ. అట్టివాసరంబులు గలశుక్రమాసంబున శుక్లపక్షంబున నేకాదశీదినంబున హరిప్రీతి
గా నీవు నిర్జలోపవాసంబు చేసి నిజరాజధాని యైనజనస్థానపురంబున విష్ణుదేవా
లయంబున మహోత్సవంబు గావించి శ్రీమహాభాగవతాదిపురాణశ్రవణంబున నా
రాత్రి జాగరణంబు సల్పి మఱునాఁడు పూర్వపర్వతశిఖరభూమిసామిసముదిత
మిహిరకిరణకిసలయవ్రాతంబునకు బాలచూతం బైనప్రభాతంబునం గృతస్నానుండ
వై సాలంకారగవిసహస్రంబు మహీసుపర్వులకు దానం బిచ్చి పారణకుం బోవ సమ
కట్టి మణికుట్టిమస్థలంబున నడుగు వెట్టుసమయంబున నెట్టఁబడి నుదరశూలంబు
పుట్టి జగజెట్టి వైద్యులచేత భేద్యంబుగాక మిగుల నుద్రేకించినఁ బ్రాణంబు కంఠ
కోణంబులఁ బెట్టుకొని కూర్మిరాణి యైననారాయణిం గటాక్షించి హీనస్వరంబున.

క. ఓనారాయణి నిన్నుం। బ్రాణముగాఁ జూచునాకు వత్తు దలఁచి పా
పానకు నొడిగట్టుకొనెం। గా నేఁడు విధాత యేది గతి యిఁక నీకున్. ౬౬.

మ. అని ప్రాణానిలముల్ తొలంగుతఱి భార్యానామధేయచ్ఛలం
బున నారాయణవర్ణముల్ తడవి తత్పుణ్యప్రభావోదయం
బున వైకుంఠపురప్రవేశమునకుం బోవంగ రోషించి ని
న్ను నిరోధింపఁగ బ్రహ్మహత్య నగునేను న్వెంట నేతెంచితిన్. ౬౭.

వ. అప్పుడు నిప్పులు రాలుకటాక్షంబున నన్ను వీక్షించి విష్ణుభక్తుని వెంబడించి యిది
యొక్కడిపిశాచంబు వచ్చె నని సంభ్రమంబున. ౬౮.

క. పదములఁ బడి మొఱవెట్టఁగ। నదయతఁ బెడకేలు గట్టి హరివీరభటుల్
చదియఁగ మోదిరి పెదపెద। గుదియలు గొని యెముక లెల్ల గుల్లలు గాఁగన్.

గీ. మోదుటయు సూక్ష్మరూపినై మేదినీశ। తావకము లైనరోమరంధ్రముల నుంటిఁ
గాని వైకుంఠవిభునికింకరులచేత। నంత నొచ్చియు విడువ లేనైతి నిన్ను. ౭౦.

ద్రవ్యధాసందడి గాసిఁ బొంద మన కేలా పాటిపోవంగఁ జే
య వలెం జేటనపెట్టి యంచు నెనుపెంపై భీకరప్రక్రియన్. ౨౫.

సీ. హోమగుండములపై కుటికి కొంకరకోఱకొమ్ములఁ గోరాడుఁ గొంతతడవు
దేవపూజావితర్దికలకై లంఘించి గొరిజల నురుమాడుఁ గొంతతడవు
పసిడాలు గలవరిపచ్చలపైఁ బడి గొదగొని భక్షించుఁ గొంతతడవు
కమలాకరములపైఁ గవిసి నీరు గలంచి క్రోలుచు బుసకొట్టుఁ గొంతతడవు
గోంట్రుగోం ట్రని గర్జించుఁ గొంతతడవు। గోరచూపుల వీక్షించుఁ గొంతతడవు
గునుకుపరువునఁ దిరుగాడుఁ గొంతతడవు। కొయ్యతనమునఁ గోపించుఁ గొంతతడవు.

క. అయ్యెడఁ దాపసకన్యలు। దయ్యము గా కెనుము గాదు తథ్యం బనుచున్
బయ్యెదలు జాఱఁ బాఱఁగ। జయ్యన మునిపుంగవుండు శంబరుఁ డాత్మన్. ౨౬.

క. మాయామహిషీతనుదై। తేయాధిపకన్య యగుట దెలిసి పటుక్రో
ధాయత్తత శపియించెను। హోయనశత మిట్లు మహిషివై పొమ్మనుచున్. ౨౭.

ఉ. ఈకరణిం దపస్వి శపియింప భయంపడి దైత్యకన్య ల
య్యా కడఁ గల్ల చేసె నిది యైన సహింపవలెన్ మది న్మహి
ష్యాకృతి దాల్చ వచ్చునె శతాబ్దము లంచుఁ గదుష్ణబాష్పధా
రాకుల నేత్రలై నిజపదాంబుజయుగ్మముమీఁద వ్రాలినన్. ౨౮.

గీ. వినుఁడు పడుచులార వృథవోదు నామాట। తనయు నొకనిఁ గన్నదాఁక నేత
దాకృతిఁ జరియించు నంతట నిజమూర్తిఁ। జెందు ననుచు నవధి చెప్పుటయును.

సీ. శంబరాశ్రమవనస్థలము వెల్వడి కొన్ని దినములు మాహిష్మతీకుమారి
నర్మదాతీరకాననముల విహరించుచుండ నచ్చోట నత్యుగ్రతపము
సలుపుసింధుద్వీపజననాథుఁ డొకనాఁడు విద్యున్మతీనామవిబుధవైరి
కన్యక వస్త్రంబు గట్టక జలదంబుఁ బాసినక్రొమ్మించుపగిది మెఱసి
యెదుట జలకేళి గావింపఁ దదఖిలాంగములు నిరీక్షించి గిలిగింత వోవుమనసు
నిలుపలేనికతంబున నిర్గమించెఁ। జరమధాతువు శైలనిర్ఝరము వోలె. ౩౦.

చ. అదియుఁ దపోమయాంగభవ మైనకతంబున దివ్యసౌరభా
స్పదమును జంద్రమండలవిభాసియు నై పవనాతపంబులన్
జెదరక నిల్చె నంత మహిషీతనుధారిణి యైనవిప్రజి
త్తిదనుజకన్య తన్నికటదేశమునం జరియించుఁ గావునన్. ౩౧.

క. పసివడి మాటికి మాటికి। వసుధాస్థలి మూరుకొనుచు వదనాంచల మా
కసమున కెత్తుచుఁ జవిగొని। యిసు మంతయుఁ జిక్కకుండ నింతయుఁ గ్రోలెన్.

గీ. క్రోలి గర్భంబు వహియించి కొడుకుఁ గాంచి। యెనుపమేను దాలంగ మాహిష్మతీపు
మారి యారీతిఁ బుట్టినమహిషదైత్యు। వల్లభుఁడు బ్రహ్మవంశవివర్ధనుండు. ౮౪.

చ. హరిహయముఖ్యదిక్పతుల నందఱ వెంపరలాడి వారలం
బురములు వెళ్ళఁ ద్రోలి కలమూలధనంబులు కొల్లవెట్టి ని
ర్భరభుజవిక్రమస్ఫురణ రాజ్యము చేయుచు నెప్పుడుం భవ
చ్చరణసరోజసేవనలు సల్పఁ దలంచుచు నుండుఁ గావునన్. ౮౫.

క. మానిని యద్దానవపతి। ప్రాణేశ్వరి వగుచుఁ గాపురము చేసితి వే
నానాభువనంబుల నీ। కానయు సుకరంబు చెల్లు నని పలుకుటయున్. ౮౬.

క. పకపక నగె నవ్వైష్ణవి। వికచాననగహ్వరమున వివిధాజాండ
ప్రకరంబులు విచ్చిన శు। క్తికలో ముక్తాఫలముల క్రియఁ గానఁబడన్.. ౮౭.

గీ. అట్టిమహిమఁ జూచి యాశ్చర్యభయసంభ్ర। మముల మూర్ఛఁ బొంది మహిషదూత
తెప్పిటి వినఁ బల్కె దేవిచిత్త మెఱింగి। విజయ యనెడు పేరి వేత్రహస్త. ౮౮.

క. ఏమును నీజగదంబయుఁ। గౌమారవ్రతల మిం దొకరిఁ బురుషులకున్
గామింప రాదు దానవుఁ। డా మదమున మమ్ము నడుగ నర్హుం డనినన్. ౮౯.

క. ఈమాటకు నెదురుత్తర। మే మైనను నియ్య వలయు నే నని తలఁపం
గా మహిషదూతఁ జూచి జ। యామానిని రోషకంపితాధర యగుచున్. ౯౦.

క. ఓరి దురాత్మక కామా। రారామలతోడ నీవరచుపల్లరుపుల్
సైరించితి మిఁక నూరక। నో రెత్తితి వేని మిగుల నొత్తువు సుమ్మీ. ౯౧.

మ. అని భర్జించినఁ బిల్లసిల్లి విముఖుండై పోయె విద్యుత్ప్రభా
ఖ్యనిశాటాధముఁ డంత నారదుఁడు గయ్యం బింతలం గల్గెఁ బోఁ
గనుఁగో నా కనుచున్ సుమాళమునఁ జంకల్ వేసికొంచున్ వడిన్
వినువీధిం జనుదెంచి మ్రొక్కి నిలిచెన్ విశ్వేశ్వరీసన్నిధిన్ ౯౨.

చ. నిలిచినఁ జూచి వైష్ణవమునీ వదనంబు చెమర్ప నిట్లు రాఁ
గలిగినకార్య మే మనుచు గండతలంబున లేఁతనవ్వుని
గ్గులు మొలవంగఁ బల్కె సురకోటులు సంగరమండలంబులో
పల మహిషాఖ్యుచే విఱిగి పాఱి విరించికిఁ జెప్ప నాతఁడున్. ౯౩.

శా. ఓసర్వేశ్వరి దృప్తుఁడై మహిషదైత్యుం డష్టదిక్పాలసే
నాసందోహముఁ ద్రోలి నిన్నుఁ జెనకన్ సన్నద్ధుఁడై వచ్చె మా
కా సామర్థ్యము లేదు వాని గెలువంగా నీవె దిక్కంచు నా
చే సర్వంబును విన్నవించి పనిచెం జేకొమ్ము తత్ప్రార్థనల్. ౯౪.

వ. అని చెప్పి నారదుండు సఫలమనోరథుండై గోష్ఠి నాడుచు నాకసంబున నదృ
శ్యుండై చనియె నిచ్చట మహిషాసురుండు నిజదూతకథితావమానభాషణశ్రవణ
జనితరోషదూషితస్వాంతుండై బలవంతంబున వైష్ణవిం బట్టి గ్రహింతు నని మందర
కందరాంతరప్రతిధ్వనదమందదుందుభిధణంధణధ్వానంబును సముద్ధురధ్వజినీ
ముఖధావద్ధయఖురస్ఫురద్ధరోద్ధూతధూళీసమూహవలాహకవలాకాయమానబిరుదకే
తనంబును రంగదుత్తుంగమతంగజఘటాభారభంగురభుజంగపుంగవఫణోత్సంగవిలో
కనవ్యాకులభోగిభీరుహాహాకారపూరితరసాతలంబునుం గా నుద్దవిడి నేతెంచు కోలా
హలంబు బాలకించి కించిదంకురితభ్రూభంగభీషణఫాలభాగ యగు నమ్మహాభాగ చిత్తం
బెతింగి రింగులు వాఱఁ గట్టినపట్టుపుట్టంబులు మాని మానితమణిమయార్ధోరుకం
బులు ధరియించి యొడ్డాణంబులు బిగియించి మంచిక్రొమ్మించుమించువలిపకంచె
లలు మాని వజ్రకవచంబులు తొడిగి పులుకడిగినముత్తియంపుంబాపటలతోడిపిల్ల
కొప్పులు మాని జడచోళ్ళెంబులు వైచి కళాచికాచమరవాలతాలవృంతాదికంబులు
మాని వివిధాయుధంబులు పూని శాలీనకోకిలాలాపంబులు మాని దానవాసహ్య
సింహనాదంబులు సేయుచు శరన్నదులు వర్షానదు లైనకరణి మందానిలంబులు
ఝంఝానిలంబు లైనచందంబున మెఱుంగులు పిడుగు లైనతెఱంగున శృంగారమనో
హరిశరీర లైనకుమారికలు దారుణాకారలై నిజాంగరోమకూపంబులం దమవంటి
వారి ననేకకోటికుమారికలం బుట్టించుచు నిలింపరిపుసైన్యపరంపరలమీఁదం గవిసి
పోరిసమరునప్పుడు వియచ్చరు లచ్చెరుపడి యీకుమారికలు కలికికన్నులచెలువం
బునన కాదు జవంబున హరిణంబుల గెలిచిరి గాని యన గొంటరిదైత్యుల నంటం
దఱుముచు నీకన్నియ లన్నువనడుములసన్నదనంబునన కాదు పరాక్రమంబు
లను హరికిశోరంబుల గెలిచిరి గాని యనఁ బ్రఖరనఖరంబుల రక్కసుల వ్రక్కలిం
చుచు నియ్యిందుముఖులు మందగమనంబునందంబునన కాదు సత్త్వంబునను మత్త
గజంబుల గెలిచిరి గాని యన దానవులం బట్టి చట్టలు చీరుచు నీలేమలు రోమరేఖ
లన కాదు క్రౌర్యంబునను గాలసర్పంబుల గెలిచిరి గాని యన దేవారిజీవానిలం
బులు గ్రోలుచు నెదురు లేక రణవిహారంబు సలిపెద రని ప్రశంసించి మఱియును.

సీ. ఉయ్యాల లూఁగుచో డయ్యులతాంగు లీపగిది వాహనములఁ బఱపు టెట్లు
చిలుకల ముద్దాడ నలయుబింబోష్ఠు లీరీతి శంఖములు పూరించు టెట్లు
సరసయానముల వేసరుఘనశ్రోణు లీఠేవ దైత్యుల వెన్నడించు టెట్లు
నునునవ్వు నవ్వ నోపనిమృదుస్వన లిటువలె నట్టహాసము ల్సలుపు టెట్లు
నెమ్మొగంబులతావికిఁ గ్రమ్ము తేఁటి। మూఁక లీలాబ్జములఁ జోప లేక బడలు
బాలపల్లవహస్త లీభంగి వాఁడి। పట్టిసముల వినుతసేనఁ గొట్టు టెట్లు. ౯౨.

చ. అని వినుతింపఁ గన్యక లనన్యసమానభుజాపరాక్రమం
బున మహిషాసురాధిపచమూభటుల న్నఱకంగ నిల్చి న
ర్తనములు సల్పు మొండెములు వ్రాలినపుల్గుల నద్భుతంబుగాఁ
గన నికృతంబు లైనతలకాయలు క్రమ్మఱ వచ్చెనో యనన్. ౯౭.

క. అటిముటిఁ గుమారికలు గొందఱు దానవభటులతలలు శరములతోడం
బెఱికిరి కరిణులు వెఱికెడు తఱచుమృణాలములతోడితమ్ములఁ బోలెన్. ౯౮.

గీ. కన్యకాకఠోరకరవాలధారలు కంఠమూలములకుఁ గత్తరింప
రణధరిత్రిఁ ద్రెళ్ళి రాకాసితల లావరించె దీర్ఘనిద్ర ముంచుకొనఁగ. ౯౯.

చ. తునిమినవైరిమస్తములతో రుధిరార్ద్రము లై విహాయసం
బున కెగయం గుమారికలమొత్తము వైచినశాతచక్రముల్
గనుఁగొన నొప్పెఁ బ్రస్ఫుటకళంకసమంచితమధ్యపూర్ణిమా
దినవిరమోదయస్థహిమదీధితిబింబవిడంబనాకృతిన్. ౧౦౦.

మ. సమయజ్యోతిషికుండు వీరదనుజస్వర్యోషిదుద్వాహసం
భ్రమలగ్నంబు ఘటింపఁ బెట్టు గడియారం బిట్లనన్ రక్తపూ
రమునం దేలెఁ గుమారికాకరధనుర్జ్యావల్లినిర్ముక్తశా
తముఖార్ధేందుశరక్షతంబు లగుతద్రక్షఃకపాలావళుల్. ౧౦౧.

క. ఈరీతి నెదురు లేక కుమారిక లుగ్రాహవమున మారిమసఁగుచో
బీరంబు విడిచి పాఱె సురారాతిబలంబు లెల్ల హాహా యనుచున్. ౧౦౨.

సీ. అది కనుంగొని మహిషాసురుఁ డేమికారణమున మనపౌఁజు రణములోన
భగ్న మయ్యె నటంచుఁ బలుకఁ గుంజరదేహుఁ డైనయజ్ఞహరాఖ్యదానవుండు
దేవ యిప్పుడు కుమారీవిసరంబుచే విఱిగె నీపౌఁ జంచు విన్నవింప
నద్దిరా మదియించి రాడంగు లందఱఁ జదియఁ గొట్టెద నంచు గద ధరించి
దేవగంధర్వకిన్నరసేవితాంఘ్రి కమలయై మందరోపత్యకాస్థలమున
నిలిచి నిజకన్యకాకోటిగెలుపు చూచుచున్న వైష్ణవివిూఁదికి నుఱికె నపుడు. ౧౦౩.

క. ప్రఘనక్షోభణదుర్ముఖవిఘనస్త్రీఘ్నాదిదైత్యవీరులు సంవ
ర్తఘనఘనాఘనఘోరాపఘను లయోఘనధనుఃకృపాణీధరులై. ౧౦౪.

వ. మిక్కిలి మొక్కలంబున దిక్కులు వగుల నార్చుచు నొక్కుమ్మడిం గవిసినం గినిసి తద్దేవి నిర్నిద్రరౌద్రరసోద్రేకంబునం బునఃపునర్నర్తితభ్రుకుటీభీషణాభిరామయై శరశరాసనడమరుముద్గరశతఘ్నీశూలకరవాలభిందివాలముసలముసుండిదండపుండరీకశక్తిపాశాంకుశధ్వజఘంటికాచక్రగదాకుంతభీకరంబు లయినవింశతికరంబులు ధరించి విరించిప్రముఖనిఖిలదేవతావితానజయజయాలాపంబు లాదరించి సంచారించి

పంచారించినపంచాననంబు నెక్కి ముక్కంటిం దలంప నతండుం గ్రక్కున నంది యెక్కంబుతోడుత ముందట నిలిచిన సవినయంబుగా బహూకరించి దేవా సకలభూతసంహారకారి వైననీపంపున నిలింపారిపరంపరల వెంపరలాడెదం జూడ నవధరింపు మంచు ధనుర్గుణంబు సారించి వెక్కసంబుగ నాకసంబున నాడు రాకాసితూఁపుఁదూనీఁగలకుం దగ వాలుపవాన గురిసె నప్పు డసురవిసరకిరీటంబులవలన రాలుహీరశకలంబులు వడగండ్లవడువున మెఱసె నీరీతి నమరారాతినికాయంబును నమ్మహామాయయు నేయుసాయకంబులు నిండి తోయజభవాండంబు సూదులక్రోవిపగిదిఁ గనుపట్టె శరపంజరంబునడుమ నడంగి పొడగానరాని భానుబింబంబునకుం బతంగనామంబు సార్థం బయ్యె దేవీమతల్లికాభల్లముఖోల్లూనంబు లైనదైతేయకేతనంబులు వారలకీర్తులు వోలె నేలం గూలి మాలిన్యంబు వహించె నారాయణీకరచక్రధారావిదారితైకోరువు లై ఱిల్లూఁతగా నిలిచిననిశాచరవీరులు సురాంగనాపరిష్వంగసుఖంబు గోరి యేకపాదస్థు లై తపంబు సేయుప్రచందంబు వహించిరి మహేశశక్తిశక్తిభిన్నహృదయు లై నిజవాహనంబుల నిలువరింపలేక తల్లకెడవుగాఁ ద్రెళ్ళుయాతుధానపుంగవులు రణరంగంబునం బిల్లమెఱుములు ద్రేయుతెఱంగులు దాల్చిరి వైష్ణవి విడిచివాటు వైచినకుంతంబుతోడన రక్తసిక్తవసుంధరం బొరలునక్తంచరులు రణభైరవవ్యాఘ్రుండు నిష్పాకలపయిం ద్రిప్పుకఱకుట్లకరణిం గైకొనిరి మాధవీముసలఘాతపత్రదదనవదను లై దనుజులు దంపునప్పుడు చెదరిపడుప్రాలతోడిమ హెూలూఖలంబులం బోలిరి చండికాసముద్దండపాశంబునం దగులువడి గింజుకొనుమనుజాశనులు పన్నినవలలం బడి తన్నుకొనుమన్నుబోతులరీతి నుండిరి లోకమాతచేతిలవణిపెట్లచేతఁ జెల్లాచెదరగుపసిఁడిచిప్పలజోళ్ళతోన గులగుల లైనశరీరంబులతోడ సోలుకీలాలపులు సంబెట నడిచిన వెడలుమిడుంగుఱులతోడియినుపకట్లచుట్టంబు లైరి పంకజగేహిని బాహుపాశాంకుశంబునం గ్రుచ్చి యెత్తినఁ ద్రేలువేలుపుఁబగ రర గిట్టి గాలంబులతోడిదొంగలభంగి నంగీకరించిరి యివ్విధంబున నపరాభూతవిక్రమంబున నపరాశక్తి విజృంభించినం గని సంరంభంబునం గుంభీరూపధరుం డగుయజ్ఞహాసుం డనుమహాసురుండు తొండంబునఁ జుట్టిపట్టి కొండలు రువ్వుచు నసహ్యవదనగహ్వరబృంహితంబుల గహ్వరివిహాయసంబులు చలియింప నముత్తాలకర్ణతాలవాతూలంబుల నూర్ధ్వలోకంబు లుఱ్ఱూఁతలూఁగ వీఁగనిచలంబున నెదురు నడచిన. ౧౦౫.

౧. ఇరువై పంచ శరంబు లేసెఁ గపటేభేంద్రంబు నాబాణముల్
శరకాండంబునఁ బుచ్చి వైచికొనెఁ గంటల్ సమస్తాస్త్రముల్

దారుఁగం జెల్లని మేనితోడ నొరగెన్ ఘూర్ణిల్లుచున్ లోకభీ
కరజంఝానిలభజ్యమానసగవాత్యుగ్రాతసౌధాకృతిన్. ౧౦౭.

మ. మహిషుం డప్పుడు జన్యభూమిఁ దనకుం బ్రాపైన బల్వీరు య
జ్ఞహరుం జంపినఁ జూచి మండిపడి దోస్స్తంభంబునం ద్రిప్పి దు
స్సహభంగిన్ గద వైవ దేవి నిశితాస్త్రం బేసినన్ దానిచే
మహిఁ గూలెన్ శకలంబులై గద గరుత్మల్లూనసర్పం బనన్. ౧౦౮.

మ. అవలీలం బరిమార్తు నంచు వరలబ్ధాభీలచక్రంబు దా
నవుఁ డెత్తె న్వడి నేలఁ గూలె నదియున్ సర్వేశ్వరీహుంక్రియా
రవనైష్ఠుర్యమహానుభావమునఁ దద్దత్కుఃకులస్త్రీజన
శ్రవణస్థాపితహేమరత్నమయపత్త్రభ్రంశసంసూచియై. ౧౦౯.

సీ. ఈరీతిఁ జెనఁగుచో నింద్రారి వైష్ణవికటుటంపర చూచి వెఱచి పఱచు
పఱచి వెండియు సిగ్గు పాటించి భీకరసైరిభాకృతి దాల్చి చేర వచ్చు
వచ్చి పంచాననవాహనాహేతినిర్భగ్నుఁడై పెక్కు రూపములు చూపు
పెక్కు రూపములు చూపి ముహూర్తమాత్రంబు పోరాడి మాయమైపోవు మఱియు
దవులఁ బోడకట్టుఁ దన్నంటఁ దఱుమనపరచేతఁ జిక్కియుఁ జిక్కక చెంగిపోవుఁ
గాని మదిలోన గెలుపాస మానఁ డయ్యె నెవ్వనికి మాన్పఁగా వచ్చు నెనుపమరులు.

తే. ఈగతి వేయివత్సరము లెక్కటిఁ బోరి త్రిలోకమాత చే
తోగతరోషఖేదములతోఁ హరి డిగ్గి త్రిశూలపాణియై
వేగ గుఁజనుంగవ న్నడుము వీఁగ సతాండవకుండలప్రభా
భోగవిభాసికోమలకపోలయుగంబు చెమర్పఁగా వడిన్. ౧౧౦.

శా. కంటెం గంటి నటంచు నార్చి శతశృంగక్ష్మాధరాగ్రంబునన్
వెంటాడించి కరాళకీలపటలత్వేళాగ్రశయార్చిశ్ఛటా
లుంటాకప్రతిఘాభరారుణదృగాలోకంబు సంధిల్లఁగా
లంటం ద్రొక్కి లులాయదానవునివక్షోగ్రంబు శూలంబునన్. ౧౧౧.

కందగర్భమణిగణనికరము.

దమనకసరభసఘమఘమసమ విశ్రమము లయి మొరయ సమణివలయముల్
గమకపుఁజనుఁగవ గదలఁగ సమరశ్రమ ఫలము గెలుగ సరగునఁ బొడిచెన్.

వ. పొడిచియుఁ గోప మాఱక నభోగతదివ్యులు పుష్పవర్షముల్
జడి గొలుపన్ భుజాకలితశాతకృపాణకఠోరధారచే

మెడ దునుమంగ జాఱె గిరిమీఁదఁ దదస్రము వానిమోహపుం
బడఁతులగుబ్బలం దొరుఁగుబాష్పపరంపరతోడఁ గూడఁగన్. ౧౧౩.

చ. అతనికళేబరంబున మహాపురుషుం డొకరుండు నిర్గమిం
చి తరణిబింబడంబరవిజిత్వరదివ్యశరీరకాంతిసం
తతులు దిగంతరాళములు దారుకొనంగ విమాన మెక్కి దై
వతపురి కేగె దేవికరవాలమునన్ మృతుఁ డయ్యెఁ గావునన్. ౧౧౪.

చ. అపుడు చతుర్ముఖాదికమఖాశను లందఱు సద్భృత్ప్రమో
దపులకితాంగులై వరుస దండము వెట్టి నుతింపఁ జొచ్చి ర
య్యపరపరాక్రమక్రమము లాగమశాస్త్రపురాణమూలభూ
త్యుపనిషదర్థగర్భితసముజ్జ్వలవైఖరి మిన్నుముట్టఁగన్. ౧౧౫.

దండకము. శ్రీమన్మహాదేవి విద్యా యవిద్యా మహాభాగ గంభీర జంభారిముఖ్యామ
రద్రోహివాహార్దితేయబాహాంతరస్థాసితస్థూలశూలావహేలాచలత్కింకిణీకంకణ
క్రేంక్రియారావవాచాలితాశాంతరాళా కరాళా మరాళాధిరూఢా విరూపాక్షి
యిజ్యా జగజ్జాలపూజ్యా మహోంకారచాపజ్య సర్వేశ్వరీ శుద్ధసత్వా శివా బుద్ధి
శుద్ధిప్రదా వీతశోకా ధ్రువా సువ్రతస్థా కృతస్థైర్యసిద్ధాంత దుర్ధాంతపాపావళీ
ధ్వాంతవిధ్వంసనాహస్కరస్వీయదివ్యాభిధేయా మహామాయ బోధస్వరూపా
సుధాస్రావిణీ భీమసందర్శనా వేదశాస్త్రాదివిద్యామహోద్యానపద్యామయూరీ
రయోరీకృతోగ్రాహవారంభశుంభద్దశద్వంద్వదోస్తంభ నారాయణీ శాంకరీ కింకరీ
భూతభూతేశ్వరా విశ్వమాతా పరిక్షోభితాంతర్జలా కాళరాత్రీ త్రినేత్రీ సురద్వేషి
తాటంకినీగర్భనిర్భేదిఘంటాపణాత్కారవిశ్వప్రపంచాంతసంభూతహేతూకృతో
చ్ఛ్వాసనిశ్వాసలీలాచమత్కార నైజార్భకీభూతనీరేజగర్భాదిపీతామృతస్తన్య చైతన్య
మూర్తీ నినుం గొల్చుధన్యుల్ గదా లోకసన్మాన్య లాకల్పకీర్తుల్ విధూతారు
లంభోజనాభుండు మన్నించుభక్తుల్ సముక్తుల్ మహాశక్తి యీతావకస్తోత్ర
మెవ్వారికిన్ బాతమా వారికిన్ ఘోరకారాలగచ్ఛృంఖలాబంధముల్ వీడు
మోమోడు భూపాలుఁ డాలంబులో వైరిసంఘంబు లోడున్ విషాంభోనలక్రూరచో
రాదిసంత్రాసముల్ లేవు దైన్యామయాపద్దశల్ రావు నీవైభవంబుల్ ప్రశంసింప
మాబోంట్లు శక్యంబె యీలీల మాపాల నెల్లప్పుడున్ గల్గి రక్షింపు మంచున్ బున
ర్వందనంబుల్ ఘటింపం బ్రసన్నాస్యయై. ౧౧౬.

క. మెచ్చితి మీకోరినవర। మిచ్చెద నడుగుఁడన దివిజు లీస్తోత్రంబుల్
నిచ్చలుఁ బఠించువారికి। నిచ్చఁ గలుగు కామితంబు లిమ్మని పలుకన్. ౧౧౭.

క. అంగీకరించి వైష్ణవి। గంగాధరముఖ్యసురనికాయంబుల నం
పెం గడువేడుకఁ దా శత। శృంగనగోత్తుంగశృంగసీమన నిలిచెన్. ౧౧౮.

గీ. వార్ధిరశన రెండవది యైనయీశక్తి। సంభవంబు వినిన సజ్జనులకు
నబ్బు నిక్క మపునరావృత్తిశాశ్వత। బ్రహ్మలోకసౌఖ్యపదవిభూతి. ౧౧౯.

చ. విను మిఁక నీలశైలవనవీథికిఁ బోయినరౌద్రి విశ్వపా
లన మొనరింతు నే ననుతలంపునఁ బంచహుతాశమధ్యసీ
మ నిలిచి యోగనిశ్చలసమాధిఁ దపం బొనరించె హల్లకం
బునడుమ నున్నసీధురసమోదిమదాళినిభంగి నత్తఱిన్. ౧౨౦.

సీ. అబ్ధిమధ్యమున రక్తాసుకం బనుపట్టణము రాజధానిగా నమితకోటి
దానవసేనలు తన్నుఁ గొల్వఁగ నున్నవనరుహాసనలబ్ధవరుఁడు రురుఁడు
నా నొక్కదైత్యుండు నముచిపాకపులోమబలుల మించిన భుజాబలముకలిమి
గర్వించి సర్వసుపర్వసామ్రాజ్యంబు గైకొందు నని దండు గదలఁ దలఁచి
ఘుమఘుమారంభసంరంభఘూర్ణమాన। కలిలసలిలంబుతో వార్ధికడల వెడల
కాద్రవేయులకన్నులు గాతుకలఁగ। భీకరజయానకము చఱపించుటయును.

వ. మహాహవసన్నాహసముత్సాహంబున వాహినీసమూహంబు లంభోధిగర్భంబు నిర్ఝరగతి వెడలునప్పుడు వెండిచిప్పలజోళ్ళతోడిపదాతులు తిమింగిలంబులభంగి నింగికిం జౌకళించిరి యింతకాలంబునకుం దమపగ సాధింప దిక్కు గలిగె నని రక్కసులఁ గూడి వజ్రపాణిమీఁద వచ్చుఱెక్కలతోడికొండలరీతి సచామరశుండాలంబులు గగనమండలి కెగసె నురుగులతోడితరంగంబులకరణి సఫేనముఖతురంగఘట్టంబులు మిన్నుముట్టె దినముఖోదయదినకరస్యందనంబు నాందోళితధ్వజపటధాళధళ్యమిషంబునం బరిహసించునరదంబు లంబరంబునకు లంఘించె నివ్విధంబునం గటాక్షితప్రతిపక్షులక్ష్యంబు లైనమహారథలక్షలును శతకోటిజిత్వరంబు లైనకరిఘటాకోటులును గంభీరహేషావధీరితశంఖంబు లైనహయశంఖంబులును వీరలక్ష్మీనివాసపద్మంబు లైనసుభటపద్మంబులుం గలదండనాయకు లనేకులు గొల్వ నసురవరుం డగురురుండు సముద్రంబు వెడలి నిర్నిద్రపరాక్రమంబున దాడివెట్టినం గని దేవతలు గోపించి యెదిరించి కవిసి రప్పు డిరువాగు రణలక్ష్మీడోల ననుకరించె నింద్రాదినిర్జరు లసురశరజర్జరితాంగులై వెఱచి పఱమువారు ముందట నీలగిరిశృంగంబునఁ బంచాగ్నిమధ్యంబున న్నిలిచి యెలమావిచిగురుజొంపంబులోనికోయిలవిధంబున విద్రుమకుడుంగంబునడిమితమాలవల్లికపగిది సంధ్యారాగాంతరాళంబునం గనుపట్టు మేఘరేఖసరణి నరుణకమలవనాభ్యంతరంబున్న నీలోత్పలిని తెఱంగున రురుదానవవధోచితక్రోధరసపరివృతం బైనతమొ

ణంబు భంగి నప్రయాసంబునం దపంబు సలుపుచున్న కాళరాత్ర్యభిధానయును సంహారకారిణియు నగురుద్రశక్తిం గని దిగదొట్టినయెలుంగులతోడ నోజగన్మాత ధాతవరంబునం గ్రొవ్వి రురుం డను దానవుండు మమ్ము సమరంబునం బరాజితులం జేసి వాఁడె వెన్నాడి వచ్చుచున్నాఁడు వానిబారిం బడకుండ రక్షింపు మని మొఱ వెట్టిన నద్దేవి పెద్దయెలుంగున వెఱవకుండు వెఱవకుం డని పలుకుచు నట్టహాసంబు చేసినం దదాననగహ్వరంబున. ౧౨౨.

క. ఉఱిమెడు కాదంబినిలోఁ। గఱకుఁ బిడుగుగములు వెడలుగతిఁ గైదువుల
నెఱుఁగులతో నుదయించిరి। జోఱజోఱ మిడుగుఱులు రాలుచూపుల శక్తుల్.

ఉ. వార లసంఖ్యకోటు లనివారితవిక్రమలీల వాలి పా
థోరుహగర్భసర్గము వధూమయ మయ్యె ననంగ నిండి దే
వారిచమూసమూహముల నాజి బడల్పడఁ గొట్టి నెత్తురుల్
వారలు పట్టి రప్పుడు బలక్షయ మైన రురుండు దెంపునన్. ౧౨౪

క. హరిహయముఖసురసేనా। పరివృత మగురుద్రశక్తిపరివారము పై
సరభసరౌరవమాయా। కరసమ్మోహనమహాశుగం బేయుటయున్. ౧౨౫.

సీ. సవ్యాపసవ్యముల్ శరము లేయుట మాని నెఱఁకులు విఱుగంగ నిలుగువారు
చటులతరాట్టహాసములు చేయుట మాని బెట్టుగా గుఱుకలు పెట్టువారు
శత్రులఁ దలయూఁచి జంకించుటలు మాని కూర్కు-పాటులఁ దూఁగి సోలువారు
సింహనాదంబులు చెలఁగి చేయుట మాని ముంచుతంద్రల నావలించువారు
నై మహేంద్రాదిసురలు దైత్యాధినాథ। మాయ జోకొట్టె నన నిద్రవోయి కలవ
రింతు రిదె వచ్చె రురుఁ డని కొంతతడవు। కొంతదడ వాదమఱచి నిద్రింతు రపుడు.

మ. కఠినక్ష్వేళలతోడ రౌద్రి జయశంఖం బొత్తినన్ జన్యభూ
లుఠదింద్రాదికదేవతాపరివృఢుల్ మోహవ్యపేతాత్మతన్
హతసంప్రాప్తనివేశులై జయజయవ్యాహారముల్ సల్పఁగా
శఠు నద్దానవుఁ జంపె శాంభవి భుజస్తంభత్రిశూలంబునన్. ౧౨౭.

క. ఆవేళ రౌద్రశూలము। త్రావిన దైతేయశోణితము ఘన మైనం
దా వాంతి చేసెనో యనఁ। గా విగళద్రక్తయుతముఖంబుల నొప్పెన్. ౧౨౮.

గీ. రురునిచర్మంబు ముండంబు సరభసముగ। రెండుగాఁ జేసి రౌద్రి చాముండి యనెడు
నామధేయంబు వహియించె నాఁడు మొదలు। సకలమంత్రాగమౌఘప్రశస్తముగను.

సీ. అప్పుడు దైత్యరణాయాసఖిన్నలై శాంభవిఁ బరివారశక్తు లెల్ల
నాఁకలి దీఱ మాకాహార మిడు మన్న మానసంబున

తననాథు మ్రుమునిఁ దలఁపఁ బోవచ్చినఁ జూచి దేవ యీపరివారదేవతలకు
భుక్తికిఁ ద్రోవ చూపు మటన్న వారిలోఁ గొందఱితోడ నాయిందుధరుఁడు
మాతృగృహములఁ దోఁటల నూతులం దటాకములఁ జేలఁ జెట్లఁ బంటల వసించి
ప్రజలు వానికిఁ బెట్టుకుబలులవలనఁ। దృప్తిఁ బొందుఁడు వీరని తెలిపి మఱియు.

సీ. పరవధూటుల మైలపరిధానములు గట్టువారలం ద్రుంచఁ గొందఱు సోఁకుఁడనియు
యంత్రమంత్రౌషధాద్యముల రక్షిత గానిబాలెంతఁ గొందఱు పట్టుఁడనియు
నెప్పుడుఁ గలహించి యేడ్చుచుండెడుశత్రుస్త్రీలఁ గొందఱు ప్రవేశింపుఁడనియు
నెడఁతెగనిచోటున నేమఱుపాటుగా శిశువులఁ గొందఱు చెందుఁడనియు
కోరి నిలువుండు పురిటింటఁ గొంద ఱనియు। నందఱికి నన్నిగతుల నాహారవిధులు
పంచిపెట్టి రణక్షోణిఁ బడినయసురునిఁ। గాంచి తచ్ఛక్తిమహిమ నుతించఁ దొడఁగె.

మాత్రాసమకతాళము. జయజయ చాముండి వికరాళి మహాకాళి శివే సిద్ధ్యే వేద్యే భీమాక్షి మహామాయి క్షుభితే కాళి కరాళి శవయానస్థే ప్రేతాసనభేదివిభీషణే భూతభయంకరి సకలక్షేమంకరి సర్వహితే బాలే నృత్తగీతవాద్యవిలోలే కాలాపహారిణి శాంతే కాంతే సర్వదేవతారాధ్యే భోద్యే కాళరాత్రి మహితాభ్యుదయే భూతాపహారిణి జయే పాశాంకుశహస్తే జ్వాలాముఖి ఘనశృంగే తీక్ష్ణదంష్ట్రికే ఫాలలోచనే త్రిశిఖముఖదళితరుధిరదనుజతనుజననసమయసముదితఖచరకరగళితసురవిటపికుసుమవిసరపరిమిళితరుధిరమధురమధురసరసనసముదనటనపరిజనే పటుమహిమజనే. ౧౩౨.

క. అని వినుతించిన శాంభవి విని మెచ్చి త్రినేత్ర వరము వేఁడుము నానే
జనుఁ డీభవదీయస్తుతి। వినుఁ జదువును వాని కిత్తు వివిధేప్సితముల్ ౧౩౩.

గీ. ఇదియె నే వేఁడువర మని యిందుశేఖరుఁడు తిరోహితుం డయ్యె నారుద్రశక్తి
బ్రహ్మశక్రముఖామరప్రతతి సనిపి। జగము లేలుచునుండె నచ్చటనె తాను. ౧౩౪.

వ. తమోగుణప్రధానయుం బరాపరాభిధానయు సంహారకారణియు నగురుద్రశక్తికి నవకోటిభేదంబులు గలవు రజోగుణప్రధానయు లోకస్థితికారణియు నగువిష్ణుశక్తికిం బదునెనిమిదికోట్లుభేదంబులు గలవు సత్త్వగుణప్రధానయుఁ బరాభిధానయు సృష్టికారణియు నగుబ్రహ్మశక్తికి లెక్కింపరానిభేదంబులు గలవు. వీనికి నిందఱికిని నిన్నిరూపంబులం బతియై రుద్రుండు రమింపుచుండు వీని నారాధించుమాంత్రికులు రుద్రునికి నమ్మినభక్తులు బ్రాహ్మియు వైష్ణవియు రౌద్రియు ననం బరఁగినయీత్రికల నవసిద్ధాంతగామినియై త్రిశక్తినామంబులును సర్వవేదాంతగామినియై జ్ఞానక్రియాశక్తినామంబులును వహించు లోకోపకారంబుగాఁ బరమపురుషుండు మూఁడుమూర్తులు దాల్చినయట్లు యేకస్వరూప యగునిమ్మహాశక్తియు మూర్తిత్రయంబు వహించె నింతియె కాని భేదంబు లేదు మహారహస్యంబుగ నీదేవీమాహాత్మ్యం బప్పటిం గాని

నవమిం గాని చతుర్దశిం గాని కృతోపవాసుండై పఠియించి నృపాలుండు సంవత్సరంబులోపల లబ్ధరాజ్యుం డగు నేతదుపాఖ్యానంబు వినినవారికి సకలకామితంబులు ఫలియించు నది వ్రాసినపుస్తకంబు పూజించువారిగృహంబున ధనకనకవస్తువాహనసమృద్ధియుం బుత్రపౌత్రాభివృద్ధియుం గలుగు నగ్నిచోరాదిబాధలు లే వని వారాహదేవుండు చెప్పిన విని ధరిత్రీహరిణనేత్ర తరువాతివృత్తాంతం బానతిమ్మని విన్నవించిన. ౧౩౫.

మ. భవదీయోరుభుజావినిర్జితమహాభారవ్యపాయోచితో
ద్భవనిశ్వాసవితర్కదాయకగుహోద్యద్వాత గోత్రాదిమ
స్తవనిక్షిప్తసమస్తదిగ్భుజగజస్తంభౌఘ తుశ్వాసవా
యువతంసా పరిషద్రిరంసకవిసంఖ్యావత్ప్రియంభావుకా. ౧౩౬.

క. ధరణినుత దేవకీపుర। వరనిలయ శ్రీగిరీశవరసంపన్నే
శ్వరవిభుతనయా సాళువ। నరసింహనృపాలదండనాయకతిలకా. ౧౩౭.

శిఖరిణి. వరాసేవాహేవాకిజనధరణీవాసవగవీ
కరాలోకాలోకాగ్రవిధుమణి రాకాశశియశో
భరా చాపాటోపార్జితబహులయశోపాయనపరం
పరా రంభాపుంభావసుఖరిపుసంభారవినుతా. ౧౩౮.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధసారసారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభి
ధాన ఘంటనాగయప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతం బైన శ్రీవరాహపురాణం బను మహా
ప్రబంధంబునం దేకాదశాశ్వాసము.

శ్రీ

# వరాహపురాణము.

## ద్వాదశాశ్వాసము.

క. శ్రీకారసదృశకర్ణ | స్వీకృతకవితాప్రవాహసితఫేనగుణ
వ్యాకారమౌక్తికస్వ | చ్ఛాకల్పా యీశ్వరక్షమాధిపునరసా. ౧.

వ. అవధరింపు మవ్వరాహదేవుండు పృథివి కిట్లనియె నట్లు రుద్రమహిమోద్ద్యోతకం బైనశక్తిత్రయచరిత్రంబు చెప్పితి నింక సకలపాతకనివారణకారణప్రభావం బైన రుద్రవ్రతావిర్భావంబు చెప్పెద మున్ను మూఁడవసృష్టిసమయంబున నలువ తన వలన జన్మించినపింగళాక్షుండును నీలలోహితుండును నైనరుద్రునిం జూచి మద్రసావేశంబున నిజస్కంధదేశంబున నిలిపి కపాలిరుద్రనగ్నకేదారసువ్రతాది కంబు లైనభవిష్యన్నామంబులు గలుగునా నాథర్వణమంత్రంబులచేత నైదవ ముఖంబునఁ బ్రహసించి జగద్రక్షణంబు గావింపు మనిన నీలలోహితుండు తన్ను ననుచితం బైనకపాలినామంబునం బిలిచినకతంబున. ౨.

క. కలుషించి విరించిభుజాగ్రములు ద్రొక్కి తదూర్ధ్వశిరము పుడికెఁ గరరుహాం
చలమునఁ దరుశాఖలపై | నిలిచి ఫలము చిదుమురీతి నిర్ఘృణవృత్తిన్. ౩.

క. నిష్ఠురహరవామకరాం | గుష్ఠనఖవిలూనమస్తకం బైనగురు
జ్యేష్ఠుని నప్పుడు చూచి గ | రిష్ఠాద్భుతభయములన్ మరీచిప్రభృతుల్. ౪.

క. తనువున గళమున మస్తక | మున భీకరభిన్నవర్ణములు గలయందుం
గని యెఱుఁగనివిపరీతపుఁ | దనయునిజన్మంబు తఁద్రడితలపై వచ్చెన్. ౫.

మ. అని భాషింపఁగ స్రష్ట శిష్టచతురాస్యం బైనదేహంబుతో
ననిలక్రూరనిపాతభగ్నశిఖరం బై నాల్గుకంబాలతో
డనె కన్పట్టెడుపైఁడిమేడవలె నుండం దత్పయోజాతగ
ర్భునిమూర్ధంబును సంతతక్షరదసృక్పూరాతి ఘోరాకృతిన్. ౬.

చ. హరునఅచేతిలోఁ మొలచినట్లు దృఢంబుగ నంటి నిల్చె ని
ష్ఠురగతి నాహరుండు తనపాణి విదల్చి నులిం గదల్చెఁ ద
చ్ఛిరసిజముల్ కుదించి తివిచెన్ జరణంబునఁ జుట్టి పట్టి ని
ష్ఠురగతి మేదినీస్థలిఁ బటుక్కు ఫటుక్కునఁ గొట్టె నప్పుడున్. ౭.

గీ. ఊడి పడఁ గన్నఁ జూచి పయోజభవుని తోడ నోపరమాత్మ యిందులకు నింక
నేమి చేయుదు నీపాప మేకతమునఁ దొలఁగుఁ జెప్పు మటన్న రుద్రునకు నజుఁడు.

మ. క్షితిఁ బంద్రెండుసమల్ చరింపు హిమరోచిర్భూష కాపాలిక
వ్రత మాచారయుతంబుగా నది జగత్ప్రఖ్యాతమై సాఁగు దు
ష్కృతము ల్నీకుఁ దొలంగు నన్న హరుఁ డేగెన్ వే మహేంద్రాద్రికిన్
భృతచింతామణికల్పకాద్యములచే హేమాద్రికిన్ మాద్రికిన్. ౯.

క. అచ్చోట బరణి గూడదు, పుచ్చినగతి నజునిశిరము పునుక నడిమికిన్
బుచ్చె వలచేతినఖమున ప్రచ్చి యెడమచేత నగము వ్రక్కలు నిలువఁగాన్. ౧౦.

క. ఆనిగాఁదివ్రక్క తునుకలుగా మొత్తి జటాంతరములఁ గట్టి తదంత
స్సీమ మణిశోడ విద్యుద్దామశిరోజముల జన్నిదంబులు చేసెన్. ౧౧.

సీ. ఇట్లు కాపాలికాకృతి ధరియించి సప్తద్వీపవృతధరాస్థలములోనఁ
గలుగుతీర్థము లెల్లఁ గలయంగఁ దిరుగ సంకల్పించి మొదల సాగరజలమున
స్నానంబు చేసి గంగానదిఁ గ్రుంకి సరస్వతీయమునాశరావతీక
వేరకన్యాకృష్ణవేణీవితస్తాదినానానదుల మజ్జనంబు సలిపి
రుద్రకాననకేదారభద్రవటము లాదిగాఁ గల సకలపుణ్యస్థలములు
ద్రొక్కి చూచి గయకుఁ బోయి రుద్రపాదములయం దావిధిపితృపిండములు ఘటించి.

ఉ. అప్పటు వాసి వేగమున నాలవయేట ధరిత్రిఁ గ్రుమ్మరన్
బచ్చనిపింఛివానిఁ పుపచ్చడమున్ రశనాకపాలమున్
గచ్చడముం దొలంగ నది గైకొన కెప్పటియట్ల తీర్థముల్
నిచ్చలుఁ జొచ్చి చొచ్చి పలునీళ్ళ మునుంగఁగ నెన్నిదేండ్లకున్. ౧౩.

క. అంటలు గట్టుము నొకటియు గొంటక తల బోడి గాఁగఁ గేశము లూడన్
మింటికి నెగసెడిరవిపై నొంటక చను సైంహికేయు నుగ్రతఁ గూడెన్. ౧౪

క. అంతటఁ ద్రిలోచనుఁడు హిమవంతంబునఁ దిరుగుచో నవమసమఁ జలి వే
నెంతయును బగిలి మదవద్దంతావళిబిందుబభ్రుతాయుత మయ్యెన్. ౧౫

క. వెండియుఁ జతురంతమహీమండలమధ్యస్థతీర్థమజ్జనరతిరు
ద్రుండు చరియించె మఱి పంద్రెండవసంవత్సరంబు నిండెడువేళన్. ౧౬

సీ. దంతిబృంహితరవాటోపంబె కాని సంవర్తఘారాధరధ్వనులు లేవు
కదళికావనవాటిఁ గదలుగాడ్పులె కాని ప్రళయప్రభంజనారభటి లేదు
గోపురసౌవర్ణకుంభకాంతులె కాని తీవ్రక్షయాదిత్యదీప్తి లేదు
విశ్వేశమజ్జనవిమలవాఃపూరంబె కాని కల్పైకోదకంబు లేదు
క్రోశపంచకపరిమితక్షోణికలిత। మైనయేపట్టణంబున నట్టికాశి
కరిగి గంగానదీస్నాన మాచరింప। హరునిచే నుండి మహిఁ జాఱె నజునిపునుక. ౧౬.

క. కమలజుశిర మీక్రైవడిఁ। దెమలి మహిం బడినవేళఁ ద్రినయనహస్తం
బమరె నపేతమరాళా। క్రమణం బగువికచరక్తకమలముభంగిన్. ౧౭.

క. ఈనిఖిలంబునఁ గలిగిన। ప్రాణులపాతకము సంస్మరణమాత్రమునన్
మానుపుమలహరుదురితము। మానిపె నీవారణాసిమహిమం బనదే. ౧౮.

చ. అని సవిధస్థితుల్ పొగడి రప్పుడు బ్రహ్మసమస్తదేవతల్
దను గొలువంగ వచ్చి హిమధామశిఖామణిఁ జూచి ఫాలలో
చన భవదీయహస్తమున జాఱెఁ గపాలము లోకముల్ నుతిం
ప నిచటఁ దాల్చు నీస్థలి కపాలవిమోచనతీర్థనామమున్.

వ. మఱియు వినుము మొదల నీవు కపాలపాణివై సకాపీనంబుగా వసుంధరం బరిభ్రమించుట మహావ్రతం బనం బరఁగు నావెనుక నగ్నత వహించి తిరుగుట నగ్నకాపాలికం బనం బరఁగు నందుపిదప బభ్రుత వహించుట బభ్రుకపాలికం బనం బరఁగు నిప్పుడు గంగానదీస్నానంబున దేహశుద్ధి వహించుట శుద్ధశైవం బనం బరఁగు బ్రహ్మహత్యకు మునుపు నీలత్వసహితుండ వగుట కైదారవ్రతం బనం బరఁగు సకలపాపక్షయకరంబు లైనయేతన్మహావ్రతంబులకుఁ దగినశాస్త్రంబులు మత్పరోగము లయినవేల్పుగములకు భావికాలంబున నుపదేశించి సకలలోకాచరణయోగ్యంబులు చేయు మని పలికి బహువిధంబులం బ్రస్తుతించి విరించి నిజలోకంబునకుం జనియె రుద్రుండును మహేంద్రాదిబృందారకులు జయజయాలాపకోలాహలంబులతో నుభయపార్శ్వంబుల సేవింప భావింప గోచరంబుగాని మహిమంబున రజతాచలంబునకు విజయం చేసి చరాచరంబు లేలు చుండె మేదినీ వేదరహస్యం బైనయీరుద్రమాహాత్మ్యంబు చెప్పితి నింక నేమి వినవలతు వదుగు మనిన.

మ. అవనీకామిని ఫాలభాగమున హస్తాంభోజముల్ చేర్చి ది
వ్యవరాహాధిపుఁ జూచి దేవ మును దుర్వాసోమునిస్వామిచే
వివిధశ్రీశమహత్త్వముల్ విని హిమోర్వీభృద్వరాభ్యర్ణపు
ణ్యవని న్నిల్చినచోటిసత్యతపుఁ డే మయ్యెం గృపం జెప్పవే. ౨౨.

సీ. నావుడు నాకుహూనావరాహుండు కాశ్యపికి నిట్లనియె నాసత్యతపుఁడు
భృగువంశజుం డైనపృథ్వీసురుండు యౌవనవేళఁ బ్రాప్తదుర్వ్యసనుఁ డగుచు
జారుఁడై నిజకులాచారం బుడిగి పాపపరత వర్తించుచు నరుణిమౌని
కారుణ్యసంపదఁ గలిగినవిజ్ఞాన మెఱిఁగి దుర్వాసోమునీంద్రువలన
హరిచరిత్రంబు విని తుషారాద్రియుత్తరమునకును బోయి పుష్పభద్రాతరంగి
ణీతటమ్మునఁ జిత్రశిలాతలమున। భద్రనామకవటపాదపంబునీడ. ౨౩.

క. కడునియతిఁ దపము చేయుచు। నడవికి నొకదినమునందు నరిగి సమిత్తుల్
కొడవంటఁ గోయునురవడిఁ। దడఁబడి తనవామహస్తతర్జని దెగినన్. ౨౪.

గీ. కైకొనక సమిధలు తొంటికరణిఁ గోయు।చుండె ఖండితతర్జనిగుండ నెత్తు
రెముక మొదలుగ లేదయ్యె నించుకైన। భూతియె వెడలె నౌర తపోవిభూతి.

క. నేలఁ బడియున్నతునుకయు। వ్రేలం దనుదానె తొంటిక్రియ నంటె నతం
డాలోన హోమసమిధలు। చాలం గోసికొని పర్ణశాలకు వచ్చెన్. ౨౬.

చ. ఇరవగునట్టిభద్రవటవృక్షముకొమ్మలనీఁద నున్నకి
న్నరమిథునంబు నెమ్మనమునన్ గడువిస్మయ మందుచున్ మునీ
శ్వరుమహిమంబు గన్గొని దివంబున కేగి సమస్తదేవతా
పరివృతుఁ డైనయింద్రునిసభాభవనంబున నుండ నత్తఱిన్. ౨౭.

క. బలభేది గొలువువారలఁ। గలయం బరికించి మీరు గనినవినినక్రొ
త్తలు చెప్పుఁ డనిన వినతాం।జలులై కిన్నరయుగంబు సవినయఫణితిన్. ౨౮.

గీ. సత్యతపునివ్రేలు సమిధలతోఁ గూడఁ। దెగినవిధము భస్మ మెగయువిధము
ధరణిఁ బడ్డతునుక తనుదానె కీల్కొన్న।విధముఁ దెలియ విన్నవించుటయును.

ఉ. ఇంద్రుఁడు విస్మయంబున నుపేంద్రునితో నిది చూడ నామదిన్
సాంద్రకుతూహలంబు కొనసాగుచు నున్నది పోయివత్తమ
న్నంత్రిజగద్విభుండును ఘనాఘనగర్జితఘుర్ఘురంబుతోఁ
జంద్రకళావినిర్మలవిశంకటదంష్ట్రికతోఁ వరాహమై. ౩౦.

సీ. తనదేహవిస్తారమున ముజ్జగము లైన నాక్రమింపదె యీమహాకలంబు
తనలావుకలిమి గోత్రమహీధరము లైన లీల నెత్తదె యీకరాళఘోణి
తనభయంకరమూర్తిఁ బెనురక్కసుల నైన వెఱపించుకొనదె యీవికటదంష్ట్రి
తనపాదహతిఁ ఫణీంద్రఫణభాగము లైన నలియఁ ద్రొక్కదె యీమదాంధపోత్రి
యనవృశం బగుతనగతి నొసలఁ గన్న। గలుగునంతటిబలువేఁటకానిసార
మేయముల కైనఁ బట్టీక మీటు మిగిలి।చనదె యీఘోరభూదారమనఁగ నపుడు.

మహాస్రగ్ధర. కిటియున్ వేశంతముల్ ముస్తలు నమలుచుఁ బోత్రిఁబునం ధాత్రిఁ ద్రొచ్చున్
మెఱుఁ గారుం గోఱఁ జిమ్మున్ మిడుఁగఱు లెగయున్ మేదినీభృద్వ్రపత్తుల్
మఱుమ్రొక్కం బైనతోఁక గొని విసరు వెసం గూలఁగా సాలపఙ్క్తుల్
పఱచున్ దాటించు దౌడల్ పయికొను నెలయున్ బల్లఱుం గల్లు నెట్టున్. ౩౨.

కం. ఈరీతిఁ గపటధరణీదారము చనుదెంచి సత్యతపునాశ్రమమున్
జేరి పొద సొచ్చెఁ దన్ముని కారుణ్యముతోడఁ దన్నుఁ గనుఁగొనుచుండన్. ౩౩.

శా. ఆవేళన్ సురవల్లభుండు మృగయుండై వెంబడిన్ రోయుచున్
దా వింటం దెగఁగొన్నకోల గరికర్ణన్యస్తపింఛంబు సం
భావింపం గుఱుబోడజుంజురు చలింప న్వచ్చి తన్మౌనితో
దేవా యిచ్చటి కేటు కడ్డకిటి యేతెంచె న్నిరీక్షించితే. ౩౪.

కం. బడలితి నెంతయు నేనుం బడుచులు నేఁ డెల్ల వెళ్ళఁ బడుమము దానిం
బొడగంటివేని నీవుం గడుపుణ్యము చూపు మనినఁ గరుణాపరతన్. ౩౫.

గీ. పందియును వచ్చె నిచటికిఁ బ్రాణభీతిఁ బొందె శరఘాతవేదనఁ బొంది తూలి
యెఱుకు నాఁకలిగొన్నవాఁ డేమి సేతు ననుచు డోలాయమానుఁడై మనసులోన.

కం. ఒక వెరవు దోఁచుటయు లుబ్ధక విను కను నేత్రములకుఁ బలుకం గా నా
లుక లేదు మఱి పలుకు జిహ్వకుఁ జూడఁగ లేవు కన్నులన హరిశ్రుతుల్. ౩౭.

తరళ. అతని సత్యము సర్వజీవదయాపరత్వము మెచ్చి సం
ప్రీతియు భీషణభిల్లభావము డించి చక్రము వజ్రముం
బతగవాహము దంతియానము పద్మనిర్మలనేత్రముల్
శతదళేక్షణముల్ వెలుంగ నిజాలరూపులు చూపుచున్. ౩౮.

మ. మునికంఠీరవ మెచ్చినారము వరంబుల్ వేఁడు మన్నం జనా
ర్దన సంక్రందన వీర లిద్దఱును బ్రత్యక్షత్వమున్ బొందె వ
చ్చినకంటెన్ వర మింక నొండు గలదే చింతింప నట్లైన నే
జను లేతత్కథ సర్వకాలముల సంశ్లాఘింతు రవ్వారికిన్. ౩౯.

కం. నెలనాళ్ళలోనఁ జేసిన కలుషము దొలఁగంగ వరము గరుణింపుఁడు నా
కిలలో జీవన్ముక్తియుఁ గలుగఁగఁ జేయుఁడు దన నట్ల కాకని వారున్. ౪౦.

స్రగ్ధర. అంతర్ధిం బొంది రాసత్యతపుఁ డచట బ్రహ్మోక్తసంయుక్తితో న
త్యంతశ్రేష్ఠక్రియం దపము సలుపుచోఁ దద్గురుస్వామి దాసో
హంభావోద్దీప్తిసద్భావుం డరుణిమునివరుం డబ్ధివేలాపరీతా
వంతన్ దీర్ఘంబు లాడ న్వలసి తిరుగుచు న్వచ్చి శ్రీతాద్రిచెంతన్. ౪౧.

సీ. దీనిపండులఁ దేనెసోనలు గూడియో మాధవశయ్యాబ్ధి మధుర మయ్యె
నీరంధ్ర మగుదీనినీడనె పెరిఁగియో మలయజద్రుమవాటి పలుకఁ బాఱె
దళ మైనదీనియాకులు దూఱిపో నోపకో యినుఁ డపరాబ్ధిఁ గ్రుంకు నెపుడు
నుఱుతలు మొగడలు గలవంగ దీనిపాల్దొరిఁగియో తెలుపయ్యె హరునిశైల
మనఁగ నాలుగుదిక్కులు సనలు గొనలుఁ బాఱి విస్మయకరలీలఁ బ్రబలినట్టి
విపులశాఖలు గలిగినవిహరదబ్జభవరథమరాళవరటమై భద్రవటము. ౪౨.

వ. కదిసి విశంకటకోటరకుటీరంబుల దాఁగుడుమ్రుచ్చు లాడుకిన్నరకన్యకలమోహనంబు లగుతమకంబులు నేర్చుకొనెడుచిలుకలయెలుంగులు ప్రతిధ్వనులజాడ మొరయ నాడకాడనునీడలం గుంపుగూడి పాడుగంధర్వబాలికలఁ ద్రాసులం దూఁచు బంగారుప్రతిమలవిధంబున నూడలం బెనచినయుయ్యాలల నొయ్యొయ్యన తూఁగు యక్షయువతుల నిజమధురాధరంబులం దత్ఫలంబులం గల్గునారుణ్యంబులతారతమ్యంబుల నొండొరుల నడుగుఖచరకుమారికలం జూచి విస్మయపడుచు శేషవాసుకిముఖ్యమహానాగంబుల మున్ను వేసి చుట్టినం గాని దీనిమొదలివలము కొలనెట్ట రాదు త్రివిక్రమదేవుండు చక్కనిక్కిచూచినం గాని దీనికొనకొమ్మలు గానరావు మహాతాండవంబు సలుపుకుండలికుండలుండు సాఁచినసముద్దండబాహామండలంబు గాని తక్కినవి దీనివిస్తృతశాఖానికాయంబులకు సరిగావు దీనిప్రతిబింబంబు చూచి సుహీ లోకులు చందురునందు మచ్చ గల దందురు దీనివిశాలపలాశంబులు చూచె నే నాదినారాయణుండు నిరంతరంబు బాలకత్వంబు వహించి పవ్వడింప వేడుక పడు దీనిదండ నధివసియించి శిష్యులకు నుపనిషద్రహస్యంబులు వక్కాణించుచు సంయములు దక్షిణామూర్తి ననుకరించుచున్నవారు పాతాళంబునకు దిగినదీనిమూలంబులు దిగ్గజాలానలీల వహించుచున్నవి హిమవన్నగంబు దీనిక్రింద నెండకన్ను నీడకన్ను నెఱుంగక నెమ్మది నున్నముక్తికన్యక విహరించుచంద్రకాంతపుటరుంగు తెఱంగున నున్నది గదా యని బహుభంగులం బ్రశంసించుచు నెదుటఁ జిత్రశిలాతలంబున బ్రహ్మవర్చసం బొలుకులువాఱ నతినియతిం దపంబు సలుపుచున్నసత్యతపునిఁ గని తాను మున్ను దేవికాతటంబున మాశకటంభతక్షయ యనుమంత్రం బుపదేశించిన శబరుండు తపోమహత్త్వంబునఁ గల్మషంబులఁ దొఱఁగి జీవన్ముక్తుం డగుట యెఱింగి సంతసించుచు నతనిచేత నభ్యర్థానప్రణామార్ఘ్యపాద్యగోదానాదిపూజలు వడసి కుశాసనాసీనుండై. ౪౩.

సీ. తనశిష్యువదనంబు తప్పక వీక్షించి మామీఁదిభక్తిసంపత్తి యెపుడు
వదలక నాస్తితత్వంగురోఃపర మను తెలివి నీవు దపంబు సలుప యాద్య

శీభావనాయత్రసిద్ధిర్భవతి తాదృశీ యనువాక్యంబు సిద్ధ మయ్యె
నిట్టినీదృఢభక్తి యెఱుఁగక నాఁటికి నేటిదో యొకపాటిమాట చెప్పి
నార మింతియ కుండమంటపవిధాన। సాంగపద్ధతి దీక్ష చేయంగ లేదు
తత్ప్రకారంబు విను సావధానబుద్ధి। నెవ్వరికి నైన నుపదేశ మియ్యరాదు. ౪౪.
క. ఒకయేఁడు జాతిశౌచా।దికములు శోధించి భక్తి దృఢ మాట యెఱిం
గి కరుణ భూసురనృపవై।శ్యకులుల కుపదేశ మిచ్చు టర్హం బగుటన్. ౪౫.
సీ. శిష్యుండు వత్సరసేవచే సంతుష్టుఁ డైనదేశికునిపాదాబ్జములకు
మ్రొక్కి నా కైహికాముష్మికసౌఖ్యప్రదాయిమంత్రముఁ గృపచేయ వలయు
నని పల్క దేశికుండును నప్పుడము చూచి కార్తికశుక్లపక్షమున ద్వాద
శీదినంబునను బ్రసిద్ధలగ్నంబున హరిమందిరంబులో నలికి ముగ్గు
మొదలుగాఁ గలశృంగారములు రచించి। యష్టదళ మైన నవనాభ మైన షోడ
శార మైన లిఖించి తదంతరమున। విష్ణుదేవుని శాస్త్రోక్తవిధి యజించి. ౪౬.
చ. కనుఁగవ ధౌతవస్త్రములు గట్టినశిష్యులఁ బుష్పహస్తులం
దననికటంబున న్నిలిపి ద్రవ్యము లంటినఁ గీడు మేలునున్
గని మఱి మంత్ర మీవలయుఁ గావున నీవును నట్ల చేయు మం
చు నరుణిమౌని సూనృతవచోనిధి సత్యతపోమునీశ్వరున్. ౪౭.
క. పలికిన నాతఁడు విహితాం।జలియై గురునాథ యిమ్ము శాస్త్రోక్తవిధం
బుల నుపదేశము నాకన। ఫలకుసుమసమేతమంటపమున నరుణియున్. ౪౮.
వ. సత్యతపోమునికి శాస్త్రోక్తప్రకారంబున శ్రీమదష్టాక్షరీమంత్రం బుపదేశించి మహా
నుభావా తొల్లియు నీవు కృతార్థుఁడవు విశేషించియు నిప్పుడు దీక్షామంటప
మధ్యంబున ధౌతవస్త్రపరిచ్ఛన్నలోచనుండవై శుభద్రవ్యసంస్పర్శనంబు గావిం
చితివి గావునఁ దపస్సిద్ధుండవై బ్రహ్మభూయంబు నిదె పొందెదవు మన కిద్దఱకు
విష్ణుసాయుజ్యంబుఁ బొందఁ నిదియ మంచిసమయం బని తాను సతండును నిశ్చల
ధ్యాననిమీలితాక్షులై సాక్షాత్కరించిననారాయణుం గలిసిరి యేతదుపాఖ్యానంబు
వినిన వినిపించినపుణ్యాత్ములకు గయాశ్రాద్ధఫలంబు సిద్ధించు వసుంధరా యింక
మానవులకు నిహలోకంబున రోగదారిద్ర్యాదిదోషంబులు దొలంగి సంతతారో
గ్యసంపత్తి పుత్రపౌత్రాభివృద్ధి దొరకువిధంబు చెప్పెద వినుము కార్తికశుక్ల
పక్షద్వాదశిం గాని సంక్రమణసోమసూర్యగ్రహణాదిపుణ్యకాలంబులం గాని శృం
గారితమంటపాభ్యంతరంబున నెనిమిదిరేకులపద్మంబు వ్రాసి యెనిమిదివిదళం
బుల నెనిమిదికలశంబుల నడుమ నొక్కకలశంబును యథావిధానంబున నిలిపి
నడిమికలశంబుమీఁద లక్ష్మీసమేతవామభాగు నారాయణుని నిలిపి షోడశోపచా

రంబులు సలిపి యింద్రయమవరుణకుబేరదిగ్గళంబుల భద్రప్రద్యుమ్నానిరుద్ధవాసుదేవుల నర్చించి యీశానాగ్నినిఋతివాయుదిగ్గళంబుల శంఖచక్రగదాపద్మంబుల యథాక్రమంబున నర్చించి మఱియు నీశానభాగంబున ముసలంబును దక్షిణభాగంబున గరుడునిం బూజించి శరశరాసనకృపాణశ్రీవత్సకౌస్తుభంబులు దేవునిపురోభాగంబునం బూజించి వైష్ణవకలశంబున ముక్తికాముని నైంద్రకలశంబున సంతతశ్రీకాముని నాగ్నేయకలశంబునఁ బ్రతాపకాముని యామ్యకలశంబున మృత్యుంజయకాముని నైఋతికలశంబున దుష్టప్రధ్వంసకాముని వారుణకలశంబున శాంతికాముని వాయుకలశంబునఁ గల్మషనాశకాముని గౌబేరకలశంబున సంపత్తికాముని నైశానకలశంబున సుజ్ఞానకామునిఁ దత్తన్మంత్రంబులతో నభిషేకంబు సలిపిన వారివారికోరికలు సిద్ధించు నింక నవకలశంబుల నభిషిక్తుం డైనధన్యుం డిహలోకంబున విష్ణుసదృశుం డై సకలసామ్రాజ్యసౌఖ్యంబు లనుభవించు నివ్విధంబున మదుక్తప్రకారంబున శోషణదాహనప్లావనంబులఁ దత్త్వశోధనంబున నోం నమో భగవతే విష్ణవే స్వాహా యనుమంత్రంబునం జేసినహోమంబున విష్ణుసూక్తంబు చెప్పుచు శంఖోదకంబునం జేయునభిషేకంబున గురునిచేత దీక్షితుం డైనసమయం బెఱింగి గురువుల హస్త్యశ్వరథగ్రామభూషణాదికంబుల యథాశక్తి సంభావించి దక్షిణాయుక్తంబుగా బ్రాహ్మణులకు భోజనంబు వెట్టి సాత్త్వికుం డై సకలదేవబ్రాహ్మణవేదనిందలం దొలఁగి వర్తించుపుణ్యులమాహాత్మ్యంబు చెప్ప నశక్యంబు వైష్ణవదీక్షఁ గైకొని యెవ్వరేని యేతద్వ్రతాచరణప్రకారంబు విందురు వారికి సంక్రమణగ్రహణవిష్ణువాసరాదిపుణ్యకాలంబుల దేవహ్రదకురుక్షేత్రపుష్కరవారాణాస్యాదిపుణ్యతీర్థంబుల వేదపారాయణంబు చేసినఫలంబు సిద్ధించు దేవతలును భారతవర్షంబున జన్మించి వైష్ణవదీక్ష వడసి వారాహంబు విని కార్తికమాసంబునఁ జేయువారాహయాగంబు చూడ నెన్నఁడు గలుగునో యని కోరుచుందురు విశ్వంభరా యేతత్ప్రకారం బెఱింగి మదుక్తసర్వాభీష్టప్రదలక్ష్మీనారాయణమండలంబు చూచిన మానవుండు రెండవవిష్ణుం డగు నింక నేమి వినవలతు వడుగు మనిన. ౪౯.

. స్వామి మున్ను సరోరుహాసనతనూసంభూతగాయత్రి వే
త్రామర్త్యారి వధించి నంద యనునాఖ్యం జెంది తద్బ్రిహ్మాచే
భీమాజిస్థలి భావివేళ మహిషు న్వధించి సర్వామర
స్తోమత్రాసము మాన్పఁ బంపువడి మంచుంగొండపై నున్నతిఁ. ౫౦.

నిలిచె నటంటివి యిప్పుడు। జలజాక్షునిశక్తి మహిషుఁ జంపెను సమర
స్థలి నంటివి యీమర్మము। తెలుపుము నా కన వరాహదేవుఁడు ధరతోఁ. ౫౧.

క. తన్వీ విను సింధుద్వీపాహ్వయుఁడు మహీపదానవాగ్రణి దోర్ద
ర్పాన్వితుఁడు స్వాయంభువమన్వంతరవేళ విష్ణుమాయాహతుఁడై. ౫౨.

క. ధర వైవస్వతమన్వంతరమున వెండియును బుట్టి నందాశక్తిన్
దురమున వింధ్యక్షోణీధరసీమ నెదిర్చి చచ్చెఁ దచ్ఛూలమునన్. ౫౩.

గీ. జ్ఞానశక్తి యనఁగ సావిత్రి యనఁగ వైష్ణవి యనంగ వివిధనామకముల
నున్నమాయలీల లెన్నంగ రా దర్ణవములయిసుక యెన్న వచ్చుఁ గాని. ౫౪.

సీ. వసుధా నవగ్రహవ్రతములు విను మింక సంయుక్తహస్తనక్షత్ర మైన
భానువారంబునఁ బ్రారంభ మొనరించి క్రమమున భానువారంబు లేడు
నక్తంబు నియతితో నడపి యేడవవారమున యథాశక్తి జాంబూనదమున
రవిఁ జేసి రక్తవస్త్రద్వయంబును జుట్టి నేతమజ్జనమార్చి నిష్ఠఁ బూజ
చేసి గొడుగును బావాలఁ జేలమును విభూషణంబులు మొదలుగా భూసురునకు
నిచ్చి బ్రాహ్మణభోజనం బిడినసువ్రతునకు నారోగ్యసంపదల్ దొరకు నెపుడు.

వ. చిత్తానక్షత్రసహితం బైనసోమవారంబు మొదలుకొని యెనిమిదిసోమవారంబులు పాయసంబున నక్తంబు సలిపి యెనిమిదవసోమవారంబున నోపినపాటి వెండి నిందుమండలంబు చేసి ధవళవస్త్రయుగంబునం బొదిగి కాంస్యభాజనంబున నిలిపి పాదుకాతపత్రదక్షిణాసహితంబుగా విప్రపుంగవునకు నొసంగి బ్రాహ్మణభోజనంబు వెట్టినసువ్రతులు కాంతిమంతు లగుదురు స్వాతినక్షత్రసహితం బైనభౌమవారంబు మొదలుకొని తొమ్మిదిభౌమవారంబులు నక్తంబులు సలిపి కడపటివారంబున యథాశక్తి సువర్ణంబున నంగారకప్రతిమం జేసి రక్తవస్త్రద్వయంబునం బొదిగి తామ్రభాజనంబున నిలిపి దక్షిణాలంకారపాదుకాచ్ఛత్రసహితంబుగా భూసురున కిచ్చి బ్రాహ్మణభోజనంబు వెట్టినధన్యులకు సకలశుభంబులు గలుగు నిట్ల నక్షత్రానుక్రమంబునం దక్కిననగ్రహంబుల వారంబు లేకోత్తరవృద్ధిగా నక్తంబులు సలిపి తత్తద్గ్రహోచితవర్ణలోహవస్త్రాదికంబుల నుద్యాపనంబు చేయునవద్యులకు నవగ్రహానుకూల్యంబు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధులుం గలుగు నీనవగ్రహకల్పంబు వినినవారికి నిష్టఫలంబులు గలుగు నని చెప్పిన విని ధరిత్రి కపటపోత్రి నాలోకించి.

గీ. దేవ మున్ను నీవు దెలిపినద్వాదశీవ్రతము పూని చేయ వర్షసాధ్య
మది నిరంతరాయమై సాగ దరిది తత్ఫలము సులభవృత్తిఁ గలుగువ్రతము. ౫౬.

ఉ. ఆనతి యిమ్మటన్న వసుధా వినిపించెద నీకు నే నుపా
ఖ్యానము మున్నిలావృతసమాహ్వయవర్షవిభుండు శ్వేతుఁ డం
భోనిధిమేఖలావలయముద్రితసర్వవసుంధరా నృపా
స్థానసమస్కృతస్వభుజశాసనుఁడై జగ మెల్ల నేలుచున్. ౫౭

సీ. తనపురోహితు వశిష్ఠునిఁ జూచి మునికులోత్తమ సహస్రాశ్వమేధములు చేయ
వలె విప్రులకు నన్నజలదాన మొసఁగుట యెందులోనిది యింక హేమకాంస్య
రత్నభూషాంబరగ్రామగజాశ్వాదు లొసఁగుదు విరహితాన్నోదకముగ
నని లిఖితాత్తశాసనహేమపట్టికాసహితఫాలము లైనజవనహరుల
వరుస విడిపించె నవియును దుర్వారలీల। వారణతురంగరథభటవాహినీప
రంపరలు వెంట రాఁ జొరరానికోటు। లెల్లఁ జొచ్చి చరించె మహీస్థలమున. ౫౯.

చ. హరిదవధిక్షమారమణు లాతురగాళి నుదుళ్ళపట్టముల్
తరువులరాయసంబులవిధంబునఁ గన్గొని శ్వేతమానవే
శ్వరునకుఁ దెచ్చి యిచ్చినవసువస్తుపరంపర లెక్కఁ గూడునె
స్వైరకులరీతిఁ దత్సవనవీథిఖురాంకము లుండు నుర్వరన్. ౬౦

సీ. ఆజ్యవేదన కోర్వక నలుండు జలధిలో బాడబాకృతి దాల్చి నేఁడు నుండు
మందాగ్నిదోషంబు మానుటకై సదా వ్యాయామ మొనరింతు రర్కవిభులు
కరిముఖుం డెప్పుడు కడుపుబ్బు డిగ్గనికతన లంబోదరాఖ్యకుఁ దయ్యె
నఱుగమి పుట్టె యింద్రాదిదేవతలకు నెన్నఁడు వంటకం బింపు గాదు
శ్వేతభూతలభర్త వశిష్ఠముని పురోధగాఁ జేసినతురంగమేధమఖస
హస్రములఁ గల్గుకమ్మనిహవ్యతతులు। మీటు మిగులంగ మెసఁగిననాఁటనుండి. ౬౧.

ఉ. శ్వేతుఁడు నశ్వమేధములు వే యొనరించి సమస్తభూతధా
త్రీతల మెల్ల నేలి తనతేజముఁ గీర్తియు నుష్ణభానుజై
వాతృకు లట్టు సంతతము వర్తిలఁ జేసినపిమ్మటన్ బలా
రాతియుఁ బోలె నాకనగరస్థితి గైకొని పుణ్యసంపదన్. ౬౨.

క. తుంబురునారదమునిగీ। తంబులు రంభోర్వశీఘృతాచీకృతనా
ట్యంబులు సిద్ధతపస్విక। దంబస్తోత్రములు సమ్మదం బొనరింపన్. ౬౩.

గీ. వివిధమహిమ లనుభవించుచు నుండియు। మందుజఠరవహ్ని మాన్పరాని
దప్పితోడఁ గూడి నొప్పింపఁ గన్నులు। మేను దిమ్మదిరిగి మిడికిపడుచు. ౬౪.

ఉ. ఆలలనావతంసముల నమ్మునులం గని జాతరానల
క్ష్వేళధరంబు నేత్రములఁ జీఁకటి గొల్పఁగ నాట లేల యీ
యాలత్తు లేటికిం జెవుల నంతకు పల్కులు పోవ నిన్నియుం
జాలును దుఃఖితే మనసి సర్వ మసహ్యమటం చెఱుంగరే. ౬౫.

సీ. అని పల్కి శ్వేతభూపాగ్రగణ్యుఁడు శ్వేతధరణీధరంబున కరిగి తనదు
బొంది మున్నా కొండపొంత ఖండించినచోటిశల్యము లతిక్షుద్భరమున

నమతే తృష్ణాతురాణాం నమచి గ్నయోగ్య మటన్న పలుకు సార్థ్యంబు గాఁగ
నప్పుడు వశిష్ఠసంయమి వచ్చి ధర్మాత్మ కటకటా స్వాస్థితక్షణము నీకు
నుచితమే యన్న నేమి చేయుదు మునీంద్ర! యిన్నినీళ్ళైన వంటకం బించుకైనఁ
దొల్లి దానంబు చేయనిదుష్కృతమున! నిర్భరక్షుత్పిపాసలు నిలువ వనిన. ౬౬.

క. ఇత్తఱి నేమనఁ గలదు నృపోత్తమ మఱి యన్నదాన మొనరింపవు నా
దత్తము పతిష్ఠ తని విద్వత్తిలకము లాడుకొనెడువాక్యము వినవే. ౬౭.

వ. రత్నహేమాదిదానంబు చేసినవార లవియ కలవా రగుదురు సకలప్రాణిసంతర్పణం
బగున న్నదానంబు చేసినవారలకు నన్ని దానంబులుం జేసినఫలంబులు గలవు తాదృశ
ప్రభావసంపన్నం బగున న్నదానంబు నీవు చేయ నెఱుంగవైతి వనిన భట్టారకా నాకు
నాఁడు పట్టినధనగర్వం బట్టిది యిట్టిదురవస్థ యెట్లు దొలంగు మున్ను పెట్టని
జలాన్నంబులఫలంబు లిప్పుడు నాకుం గలుగునుపాయంబు చేయ నవధరింపు
మనిన భూవరా నీవలెనే తొల్లి సునీతుం డనుమహారాజు సర్వమేధాధ్వరంబులు
సలుపుచు నన్నదానవిరహితంబుగా విప్రులకు సకలదానంబు లొసంగి శరీరావ
సానంబున నాకలోకభోగంబు లనుభవింపుచుండియు నాఁకట నన్నంబున కేఁకట
పడి సకలలోకంబులం బరిభ్రమింపుచు నిజకళేబరంబు దహించినమాయాపురిపరి
సరంబున భృగుమహామునిం గని వినయంబునఁ దనవృత్తాంతంబు విన్నవించిన
నమ్మహానుభావుండు సునీతు నవలోకించి నీకు నేతద్దౌస్థిత్యనివారణకారణం బగు
నొక్క మహావ్రతంబు చెప్పెద వినుము కార్తికమాసంబునం గాని మార్గశిరమాసం
బునం గాని శుక్లపక్షదశమి నేకభుక్తిసంకల్పంబు లొనరించి యేకాదశినాఁ డుపవ
సించి నాఁటిరాత్రి శృంగారితమంటపాంతరంబున ధరణీవ్రతంబుచందంబున నా
లుగువంకల నాలుగుకలశంబులు నిలిపి తన్మధ్యంబున బ్రహ్మవిష్ణుమహేశలోకపా
లాదిదేవతలను సర్వౌషధీరసాన్వితభూచక్రంబును వహించినకాంచనవిరచిత బ్ర
హ్మాండభాండంబును నిలిపి తదుపరిస్థలంబున నారాయణు భావించి కార్తికోక్తమం
త్రంబులం గాని మార్గశీర్షోక్తమంత్రంబులం గాని పాదాదికేశాంతంబును గేశాదిపా
దాంతంబునుగాఁ బూజించి జాగరణంబు గావించి ద్వాదశినాఁడు సూర్యోదయా
వసరంబున వేదవేదాంగపారంగతు లైనవిప్రపుంగవులు నలువురకు నాల్గుకలశం
బులు దానంబు చేసి నడిమి బ్రహ్మాండకలశంబు కుటుంబియు శాంతుండును గత
తృష్ణావిధిజ్ఞుండు నగు నాచార్యునకు సాంగంబుగా సమర్పించినధన్యు లనేక
యుగంబులు విష్ణులోకంబున సుఖం బుండి ముక్తికాములు ముక్తు లగుదురు భుక్తి
కాములు భూమిం జనియించి సకలసామ్రాజ్యసుఖంబు లనుభవించి పిదప ముక్తు
లగుదురు. ౬౮.

క. కావున నేతద్ధనము। నీవునుఁ గావింపు మనసు నిగుడుదు వన భూ
పావిత్రతులు గరఁగించిన। సౌవర్ణముచేత నంబుజభవాండంబున్. ౧౯.

క. చేయించి భృగున కిచ్చెను। మాయాపురిలోన శ్వేతమహీవర నీవుం
జేయు మనఁ జేసి తా ని।శ్శ్రేయససౌఖ్యములు గనియె శ్రీహరికరుణన్. ౨౦.

క. ధరణీహారిణీనేత్రా। ధరణీవ్రతసదృశ మైనదానం బిది శ్రీ
హరిభక్తులకుం గాని యి।తరులకు సిద్ధింప దెవ్విధంబున నైనన్. ౨౧.

సీ. ధుతసర్వపాపసందోహ మీవారాహ మాదినారాయణుం డానతిచ్చెఁ
గమలసంభవున కాకమలసంభవుఁడును దనపుత్రునకుఁ బులస్త్యునకుఁ జెప్పె
నాపులస్త్యమునీశ్వరాగ్రణివలన భార్గవరాముఁ డెఱిఁగె నారాముఁ డాత్మ
శిష్యుఁ డుగ్రునకు వచించె నయ్యుగ్రుండు మనువున కిచ్చెఁ గ్రమమునఁ బూర్వ
కల్పకథ యిది యిప్పటికల్పవేళ। వింటి సర్వజ్ఞుచే నేను విశదముగ మ
హీసతీ నీకుఁ దెల్పితి నింక మీఁదఁ। గపిలముఖ్యమునీంద్రులు దపము చేసి. ౨౨.

క. నీచేఁ దా రాద్యంతము। నేచుకొనంగలరు వరుస నిఖిలపురాణ
ప్రాచుర్యకరణలీలా। వాచాలుఁడు వ్యాసుఁ డెఱుఁగు వారలవలనన్. ౨౩.

గీ. అతనిప్రియశిష్యుఁ డగురోమహర్షణుండు। సత్రయాగాంతరంబున శౌనకాదు
లకు సమస్తంబుఁ జెప్పఁగలఁడు పరాశ।రసుతుఁ డష్టాదశపురాణరచనకర్త. ౨౪.

వ. దురితశరనివారణవజ్రతనుత్రాణంబును రసవదద్భుతవివిధకథాసుధాఝరీణంబును నారాయణభక్తిశరీరప్రాణంబును బోధరత్నోత్తేజనశాణంబును జనితసకలకల్యాణంబును నైనయీవారాహపురాణంబు కార్తికమాసాదిపుణ్యకాలంబులందు నియమంబుతోడ భక్తియుక్తంబుగా వినినవారికి వాజపేయాశ్వమేధాదియాగంబులును గంగాదికపుణ్యతీర్థస్నానంబును హిరణ్యగర్భతులాపురుషాదిమహాదానంబులును జేసినఫలంబును నాయురారోగ్యైశ్వర్యంబులును విష్ణుసాయుజ్యంబును గలుగు నీపురాణంబు శబ్దార్థరసభావబంధురంబుగా వినిపించువక్త మాతృపితృవంశ్యుల నిరువదియొక్కతరంబువారి నుద్ధరించి పరాశరాత్మజునిచందంబున సకలలోకమాన్యత వహించి యిహంబున దైన్యవిరహితజీవనుండై సకలవిద్యాసంపత్తి నెదురులేక మెలంగి పునరావృత్తిరహితశాశ్వతబ్రహ్మలోకసౌఖ్యంబు ననుభవించు నట్టి వాచకులవలన వినినట్టివారలు వాచకునకు గజతురగగ్రామభూక్షేత్రాంబరస్వర్ణాభరణాందోళికాదు లాసంగవలయు నశక్తులు విత్తశాఠ్యంబు చేయక పూజింపవలయు నిట్లు చేయక లోభంబునం గాని గర్వంబునం గాని వాచకు ననాదరణంబు చేసిన దురాత్ముకు లేడుజన్మంబులదాఁక మూకలు వెఱ్ఱులు నై పుట్టుదురు వాచకునిఁ బూ

జించుధన్యులగృహంబునందు లక్ష్మీనారాయణుండు సుప్రతిష్ఠుండై యుండు
నని వరాహదేవుండు ధరావరారోహ కానతిచ్చె. ౭౫.

మ. నరకంఠీరవ చండబాహుబలశుండాలాళికాశీకర
స్ఫురణాష్టద్విపసార్వభౌమతుహినాంభోభస్త్రీకాధారవ
ద్ధరదీశానసదానుభూతభువనద్వ్యాప్తా ప్రతాపోష్మసం
భర ధాత్రీసురకారితాధ్వరహవిస్స్వాద్యద్దివౌకస్స్తుతా. ౭౬.

క. రామానుతతనుమారా। తామరసాతతకరాకతతసారమతా
శ్రీమహిమహామహిమ శ్రీ। రామసమసరాగసాగరాసమసమరా. ౭౭.

జాతివృత్తహారిణి. తరుణహారిణీనేత్రాచేతోజ దానధురంధరా
నిరుపమకళావైయాత్యస్థాన నీతియుగంధరా
నిరతవిసరద్దానస్రోతస్వినీతనుజార్వణా
దరణచతురంతోదన్వత్తూర్ణకుదోద్బలసింధురా. ౭౮.

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరప్రసాదలబ్ధసారసారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభి
ధాన ఘంటనాగయప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతంబైన శ్రీవరాహపురాణంబను మహాప్రబం
ధంబున సర్వంబును ద్వాదశాశ్వాసము.

---

సంపూర్ణము